# ఆంధ్రపత్రిక

317603




The Andhra Patrika, Madras. } Regd. No M. 1118 Vol. 36 No 244 WEDNESDAY 7th DECEMBER 1949 వెల ఒకఅణా } Founder: K.NageswaraRao


# "ఏప్రెల్ 1 కి రాష్ట్రవిభజన జరిగేట్లు అన్ని యత్నాలు చెయ్యవచ్చు"

## "సర్వసమస్యలూ జనవరి 26 లోపున పరిష్కారం అగుట సాధ్యంగాదు"

### కేంద్రప్రభుత్వానికి వ్రాయబోవు లేఖాంశముల గూర్చి మద్రాసు మంత్రివర్గ నిర్ణయం

చెన్నపట్నం, డిసెంబరు 6: ఆంధ్రరాష్ట్రాన్ని ఏప్రెల్ 1 వ తేదీన ఏర్పాటుచేయడానికి అన్ని యత్నాలూ చేయవచ్చుననీ జనవరి 26 వ తేదీకి సర్వసమస్యలూ పరిష్కారం కావడం అసాధ్యమనీ ముగ్గురు సభ్యులు గల ఒక సరిహద్దుసంఘాన్ని కేంద్రప్రభుత్వం వారు నియమించవలెననీ మిగతా సమస్యలన్నీ రేపు నియమింపబోవు సంఘంవారు పరిష్కరించగలరనీ, కేంద్రప్రభుత్వమునకు మద్రాసుప్రభుత్వ అభిప్రాయంగా వ్రాయగలమని మద్రాసుప్రచార మంత్రి భక్తవత్సలంగారు నేడు పత్రికాప్రతినిధులతో మంత్రివర్గ సమావేశానంతరం తెలిపిరి.

మద్రాసు మంత్రివర్గమువారు నేడు ఫోర్టుసెంట్ జార్జిలో మంత్రివర్గ మందిరమున ప్రధాని కుమారస్వామి రాజాగారి అధ్యక్షతను సమావేశమై ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునుగూర్చి చర్చించిరి. సమావేశానంతరము మద్రాసుప్రధానమంత్రిభక్తవత్సలంగారు పత్రికలవారికీవిధముగా తెలిపిరి.

"ఆంధ్రరాష్ట్ర నిర్మాణము సందర్భమున కేంద్రప్రభుత్వమువారు కొన్ని సమస్యలను పరిశీలించి పరిష్కరించవలసినదిగా మమ్ములను కోరినారు. ఇందునిమిత్తమై ఒక సంఘమును నియమింప వారుకోరి ఉన్నారు. ఈ సమస్యలన్నిటినీ చర్చించి తేల్చి 1950 జనవరి 26 వ తేదీలోపల రాష్ట్ర నిర్మాణము చేయ సాధ్యమేమో చెప్పవలసినదిగా వారు కోరినారు. ఉ సమస్యలన్నిటినీ జనవరి 26 వ తేదీలోపల తేల్చుట అసాధ్యమని మేము అభిప్రాయపడుచున్నాము. ఈ సంగతి వారికి వ్రాయనున్నాము. ఏప్రిల్ ఒకటవ తేదీకి రాష్ట్రము నిర్మాణమగుటకు యత్నములు చేయవలెనని మేము అభిప్రాయపడుచున్నాము రాష్ట్ర నిర్మాణమునకు చిత్తు విభజన సిద్ధముగా ఉన్ననూ భారత ప్రభుత్వమువారు పరిహద్దు నిర్ణయ సంఘము రావలెననియు, గవర్నర్ జనరల్ ఉత్తర్వులోపల ఇది జరుగవలెననియు, అందు విషయమై మా అభిప్రాయమేమి అనియు అడిగినారు.

#### సరిహద్దు సంఘం

సరిహద్దు నిర్ణయ సంఘములో ముగ్గురు సభ్యులు ఉండవలెననియు అందు ఒకరు హైకోర్టు జడ్జి సర్వీసులో ఉన్నవారుగాని, రిటైరు అయినవారుగాని అయి ఉండవలెననియు, మొత్తం ముగ్గురు గూడా, మద్రాసు ఒరిస్సా రాష్ట్రములకు సంబంధించిన వారుగాకుండా ఉండవలెన

2-వ పేజి చూడుడు

## సరిహద్దు రాష్ట్రంలో పఠానుల తిరుగుబాటు

### పాకిస్తాన్ ప్రధానికి జరూరు వర్తమానం

పెషావరు, డిసెంబరు 6: "సరిహద్దు రాష్ట్రములోని పఠానులు తమకు పఠానిస్తాన్ అను ఒక స్వతంత్రరాజ్యము ఏర్పడవలెనని ఆందోళన చేయుచున్నారు. అంతేగాక అచటి ముస్లింలీగులో కొన్నకక్షలేర్పడి తగవులాడుచున్నవి. ఈ పరిస్థితులు అంతకంతకు విషమించి ముప్పు తెచ్చిపెట్టుచున్నవి. అందువల్ల పాకిస్తాను ప్రధాన మంత్రి లియాకతాలీఖానుగారు జరూరుగా ఒకసారి సరిహద్దురాష్ట్రములకు రావలెను" అని అచటి ముస్లింలీగువారు వర్తమానము పంపిరి. డిసెంబరు 6 తేదీని లియాకతాలీ ఖానుగారు పెషావరుకువెళ్లి సరిహద్దు రాష్ట్రములలోను కొండ జాతులవారు నివసించెడి ప్రాంతములలోను పది దినములు పర్యటనం చేస్తారు. ఈ సరిహద్దు రాష్ట్రములలోని పఠానుల తిరుగుబాటు కరాచీలోని పాకిస్తాను ప్రభుత్వపు మనస్సునుచాలా కలవరపరచుచున్నది.

## ద్రవ్యచలామణి విధానం పట్ల పాకిస్థాన్ లో విభేదాలు

### తూర్పు బెంగాల్ ఆర్థికమంత్రి హమిదుల్ చౌదరీ రాజీనామా

డక్కా, డిసెంబరు 15: తూర్పు బెంగాలులో వాణిజ్యానికీ, ఆర్థిక వ్యవహారాలకు, పరిశ్రమలకు మంత్రిగా ఉన్న హమీదుల్ హక్ చౌదరీ ఈవేళ తమ పదవికి రాజీనామా ఇచ్చారనిరు.

వీరు ఈ విషయం తూర్పు బెంగాలు అసెంబ్లీలో ప్రకటించిన పిమ్మట ఆయా ప్రభుత్వ శాఖలకు వెళ్లి, అక్కడ ఉన్న పెద్ద ఉద్యోగులతో సంభాషించి, వారిదగ్గర సెలవు తీసుకున్నారు.

హమీదుల్ హక్ మంత్రి కాక పూర్వము కలకత్తా హైకోర్టులో అడ్వొకేటుగా ఉండేవారు. వీరు మళ్లీ డక్కాలో తమ వృత్తిలో ప్రవేశించగలరని తెలుస్తున్నది.

#### పాకిస్థాన్ ప్రభుత్వంతో అభిప్రాయ భేదం

తూర్పు బెంగాలు ఆర్థికమంత్రి ఈ మధ్యాహ్నం రాష్ట్ర శాసనసభలో ఒక ప్రకటనచేస్తూ ఈవిధంగా తెలియజేశాడు: "నేను పాకిస్థాన్ ప్రభుత్వ దృష్టిలో నిష్కారణంగా ఆ విశ్వాసానికి గురిఅయినాను. మంత్రిగా నాబాధ్యతా నిర్వహణాన్ని నిష్పాక్షిక విచారణ సంఘంచేత పరిశీలింపజేస్తే అందుకు నేను తప్పక హాజరౌతాను.

పాకిస్థాన్ ప్రభుత్వం రూపాయి మార

(2-వ పేజీ చూడుడు)

## భారత రిపబ్లిక్ అవతరణోత్సవం

### పారిశ్రామిక చిత్రకళా ప్రదర్శనాలు

న్యూఢిల్లీ, డిసెంబర్ 5: 1950 జనవరి 26 వ తేదీన, రిపబ్లిక్ అవతరణోత్సవ సందర్భంలో, ఢిల్లీలో పెద్ద పెట్టున జాతీయ పారిశ్రామిక చిత్రకళా ప్రదర్శనాలు జరపటానికి యేర్పాట్లు జరుగుతున్నయ్. వీటికి, బహుశా, రిపబ్లిక్ ప్రధమాధ్యక్షులు ప్రారంభోత్సవం చేస్తారు.

## ఇండియాకు అమెరికా గోధుమ సప్లయి

వాషింగ్టన్, డిసెంబరు 6: అమెరికా నుండి 10 లక్షల టన్నుల గోధుమలు సమపాయమైన ధరలకు, ఇండియాకు లభ్యమయ్యేదికాదని, అమెరికా గోధుమ ఉత్పత్తి మిగులుపైనా అవసరదేశాలకు యీ మిగులులో, ఎంతసప్లయి చేయగల పరిమాణంపైనా కొంతవరకు ఆధారపడి ఉంటుందని అమెరికా వ్యవసాయశాఖా కార్యదర్శి చార్లస్ బ్రానన్ వెల్లడించాడు.

పంట ఉత్పత్తిలో మిగులు లేకపోయినా ఇండియాతో ఇలాంటిబేరం చేసుకొనే విషయం ఆలోచించడానికి అవకాశం లేకపోలేదు." అని బ్రానన్ పత్రికావిలేఖరుల సమావేశంలో తెలిపాడు.

అమెరికానుండి 10 లక్షల టన్నుల గోధుమలను ఇండియాకు లభించేటట్లు చేయడానికై ఇండియా ప్రతినిధి సర్ చింతామణిదేశముఖ్ అక్టోబర్‌లో సంప్రదింపులు ప్రారంభించాడు. ఈ సంప్రదింపులు 15 రోజులక్రితం ప్రతిష్టంభనలో పడినవి. ఈ ప్రతిష్టంభనకు ముఖ్యకారణాల్లో ధర విషయంగూడా ఒకటని తెలుస్తున్నది. ఇది అధిగమింప వీలుకాని అభ్యంతరంకాదని బ్రానన్ అన్నారు.

## భారతప్రభుత్వంతో పారిశ్రామికుల సంబంధాలు

### విలేఖరులగోష్ఠిలో నెహ్రూ వివరణ

న్యూఢిల్లీ, డిసెంబరు 6: ఢిల్లీలో నిన్న జరిగిన పత్రికా విలేఖరులగోష్ఠిలో ప్రసంగించుతూ, ప్రధాని నెహ్రూ, పారిశ్రామికులకూ ప్రభుత్వానికి అత్యంత సాన్నిహిత్యమున్నదనీ, సహాయనిరాకరణం చెయ్యాలనే అభిప్రాయమేదీ పారిశ్రామికులకు లేదనీ ప్రకటించారు.

ప్రశ్న:-పారిశ్రామికుల అవసరాలేమిటో, వారికి యేసౌకర్యాలు కలుగజేస్తే తృప్తి కెందుతారో తెలుసుకునేందుకు ప్రభుత్వమేమైనా ప్రయత్నించిందా? కార్మికులవల్ల యిబ్బంది యేదైనావస్తే కార్మిక ప్రతినిధులను పిలిపించి వారి కోరికలేమిటో తెలుసు కుంటున్నారు. అలాగే పారిశ్రామికుల విషయంలోకూడా తెలుసుకుంటున్నారా? పారిశ్రామికులు మీదగ్గరకు వచ్చినప్పుడల్లా ఎదోఏకపక్ష సంప్రదింపులుగా నచ్చచెప్పి పంపుతున్నారు.

జవాబు: పారిశ్రామికులు ప్రభుత్వంతో సహకరించటంలేదనీ, వారు అలా సహకారం చేయటానికి అంగీకరించేముందు యేవో కోరికలు తీరిస్తేగాని వీలుపడదంటున్నారనీ-ఈరకం - అభిప్రాయాలేవో మనసులో పెట్టుకుని మీరీ ప్రశ్న వేస్తున్నారు. ఈ రకం ఊహాలుకేవలం నిరాధారమైనవని ముందు తెలియజేస్తున్నాను. పూర్వం అలాటిపరిస్థితేదైనా కొంత వుంటే వుండేదేమో కాని, ఇప్పుడు అలాటిదేమీ లేదు. ఈ పారిశ్రామికులలో యేదైనా ఒక ప్రత్యేకవర్గంవారికి యేదైనా కోరికలున్నాయేమో నేను చెప్పలేను గాని, మొత్తంమీద, ప్రభుత్వం పారిశ్రామికులందరితోనూ చాలా సాన్నిహిత్యంలోవుండి పారిశ్రామిక మంత్రివర్గం, ఎడ తెగకుండా వారితో ప్రతివిషయం సంప్రదింపుతూనే వున్నది ప్రస్తుతం, పారిశ్రామికులలో సహాయనిరాకరణం చెయ్యాలనే అభిలాష యేదీలేదు.

ప్రశ్న:-ఇటీవల పరిశ్రమలలో పని పాడవటానికి, సమ్మెలకంటె ఫ్యాక్టరీల మూసివేతలే ఎక్కువగా కారణభూతమౌతున్నాయంటున్నారు. ఇది నిజమేనా.

నెహ్రూ:-మీరు ఒట్టి మిల్లుల సంగతిని యెత్తి చూపుతున్నారు. ప్రభుత్వం ఈ విషయాన్ని అత్యంత శ్రద్ధతో గమనిస్తున్నది.

ప్రశ్న:-మధ్యనిషేధ కార్యక్రమాన్ని కొంత పరిమితంచేసి వ్యవహరించమనిమీరు రాష్ట్రాలకు ఆదేశించారు. కాని బొంబాయి, మద్రాసు రాష్ట్రాలవారు ఆ కార్యక్రమాన్ని మరింత తీవ్రంచేశారు. దానివల్ల కేంద్రప్రభుత్వం తాలూకుమార్చి బడ్జెటులో యేదైనా వ్యయం పెరుగుతుందా?

నెహ్రూ: రాష్ట్రాల బడ్జెటులుమాత్రం కొంత పెరిగితీరతవి. నిజానికి, నేనన్న మాటలవల్ల కొంత ప్రయోజనం కలుగకపోలేదు. కాని అనుకున్నంత ప్రయోజనం కలుగలేదు. పూర్తిగా పెడచెవిని పెట్టటంమాత్రం జరుగలేదు.

#### "ఒకరివత్తిడికి లొంగేదిలేదు"

భాషారాష్ట్ర నిర్మాణ విషయాలను గూర్చి ప్రధాని నెహ్రూను ఇలా ప్రశ్నించారు.

ప్రశ్న:- కర్నాటకరాష్ట్ర నిర్మాణం చెయ్యటానికి-కాంగ్రెసు కార్యవర్గం అంగీకరించనందుకు అసమ్మతిగా కేంద్రరాష్ట్ర శాసనసభలలోని 12 మంది కర్నాటక నాయకులు రాజీనామాలు దాఖలు చేసి

(2 వ పేజీ చూడుడు)

## ఆంధ్ర తమిళ నాయకులతో శ్రీ కళా వెంకట్రావుగారి సంప్రదింపులు

### తాత్కాలిక రాజధాని మద్రాసులోను, విజయవాడ రాజధానిగాను నిర్ణయించే అభిప్రాయం

చెన్నపట్నం, డిసెంబరు 6: అఖిల భారత కాంగ్రెసు కార్యదర్శి కళా వెంకట్రావుగారు ఆస్తి అప్పుల విభజనసంఘ నియామకము, రాజధాని, రాష్ట్రనిర్మాణము మున్నగు విషయములను గూర్చి శ్రీ ప్రకాశం, నాడార్, కుమారస్వామిరాజాగారలతో వేర్వేరుగా చర్చలు జరిపిరి. ఆంధ్రనాయకులు మదరాసు విషయమున పరిహద్దు సంఘము వచ్చునని చెప్పుటచేత తమిళులు ఆత్రపడి తెనుగువారు తాత్కాలికంగా గూడా మద్రాసులో ఉండరాదనే పుద్యమాన్ని ప్రారంభించినారనీ, ఆంధ్రుల రాజధాని మద్రాసులోఉండదు. అని ఖచ్చితముగా చెప్పి, తర్వాత పెట్టుకోబోవు రాజధాని ఏదో చెబితే తాత్కాలికంగా మద్రాసులో రాజధాని పెట్టుకొనేందుకు అంగీకరించగలరనీ ఆభిజ్ఞవర్గాలవారు, తెలుపుతున్నారు. శ్రీ ప్రకాశం పంతులుగారు రాష్ట్ర కాంగ్రెసు సమావేశానంతరం ఇచ్చిన ప్రకటన, కేంద్రశాసనసభలో మద్రాసు భవిష్యత్తును తేల్చుటకు సరిహద్దు నిర్ణయ సంఘం నియమింపబడగలదని చేసిన ప్రకటనలు తమిళనాయకులను కేంద్ర ప్రభుత్వమువద్దకు రాయబారం వెళ్లుటకు ప్రేరేపించినవని తమిళనాయకులు చెప్పుచున్నారు. మద్రాసురాష్ట్ర రాజధాని స్వాతంత్ర్య హక్కునకు భంగంలేకుండా తెలుగువారు మద్రాసులో పరిపాలన జరుపుకోగలరనే శ్రీ వెంకట్రావుగారి ప్రకటనపై తమిళులు సుముఖవైఖరి ప్రదర్శించుచున్నారు.

తెనుగునాయకులు రాజధానీ నగరము వెంటనే చెప్పవలెనని పట్టుపట్టుట బాగానే ఉన్నదిగాని ఆపేరేదో వారే చెప్పుట బాగుంటుందని ఒక ఆంధ్రనాయకుడు ఆంధ్రపత్రిక ప్రతినిధితో తెలిపెను. ఆంధ్రనాయకులు తాత్కాలికంగా మద్రాసులో రాజధాని ఉంచుకొనగలరనీ తర్వాత రాజధాని ఆంధ్రదేశాని కంతకూ మధ్యగాఉన్న విజయవాడ అని చెప్పగలరనీ అభిజ్ఞవర్గాలవారు తెలుపుచున్నారు.

(2-వ పేజి చూడుడు)

## ఆయుర్వేద యునానీ ఔషధశాస్త్రోద్ధరణ

న్యూఢిల్లీ, డిసెంబరు 5: యూనానీ ఆయుర్వేదాల ఉద్ధరణకు, పరిశోధనలకు గల అవకాశాలను విచారించ వలసిందని భారత ప్రభుత్వం 9 గురు డాక్టర్లు గల విచారణ సంఘాన్నొకదానిని నియమించిందని తెలుస్తున్నది. ఈ విచారణ సంఘనివేదిక ఇంతకుపూర్వం వెలువడిన చోప్రా కమిటీ నివేదిక ననుసరించి వ్రాయబడగలదని తెలుస్తున్నది.

భారత పరిశోధకనిధి సభ్యులైన జి. జి. పండిట్ ఈ విచారణసంఘానికి అధ్యక్షులుగా నియమితులైనారు.

ఆ పట్టభద్రులు కానివారికి ఏర్పరిచిన వైద్యపాఠ్య ప్రణాళికలో యూనానీ ఆయుర్వేదవిషయాలను ఏర్పరచడానికి గల అవకాశాలనుగూడా పరిశీలించవలసిందని భారత ప్రభుత్వం ఈ విచారణసంఘాన్ని అడిగినదట.

ఈ విచారణసంఘం ప్రస్తుతం ఉన్న యునానీ ఆయుర్వేదపాఠశాలలోని పాఠ్య ప్రణాళికలలో చెయ్యవలసిన మార్పులను గూడా పరిశీలించగలదట. భారత ప్రభుత్వం సలహాను అనుసరించి ఈ సంఘం ఇండియా కంతటికీ ఒకేరకమయిన పాఠ్య ప్రణాళిక నిర్ణయించగలదట.

ఈ విచారణ సంఘం రేపు రాబోయే మార్చి నెలాఖరులోగా తన నివేదికను భారత ప్రభుత్వానికి అందజేయగలదని తెలుస్తున్నది.

అసలీ విచారణసంఘం చోప్రాకమిటీ సలహాపైనే ఏర్పరచబడినదని కూడా తెలుస్తున్నది.

## రైల్వే ఉద్యోగుల వేతనాల సమస్య

### అధికార ప్రకటన

న్యూఢిల్లీ, డిసెంబర్ 6: రైల్వే ఉద్యోగుల వేతనాలను గురించి పత్రికలలో వచ్చిన అసమగ్రప్రకటనలు చూచి వాస్తవాన్ని తెలియజేయటానికి ప్రభుత్వం యీ అధికార ప్రకటన చేస్తున్నది:

1. పే కమిషన్ సిఫారసు ప్రకారం నిర్ణయింపబడేజీతం అను సంవత్సరాలకు ఒక 'ఇంక్రిమెంటు చొప్పున' రావలసిన మొత్తానికి తక్కువగా వుంటే ఆ వ్యక్తి జీతం ఆ మొత్తానికి బరీబరిగా పెంచబడుతుంది.

2. అంతేగాక, 250 రూపాయలకు తక్కువజీతం తీస్తూ, 25 సంవత్సరాల నౌకరీ పూర్తి అయిన ప్రతివ్యక్తికీ మరొక అదనపు ఇంక్రిమెంటు ఇవ్వబడుతుంది.

ఈ రకంగా ప్రభుత్వం ఉత్తరువులు జారీచేస్తున్నది. ఇవి జనవరి 1 వ తేదీ నుంచి అమల్లోకి వస్తవి.

## భారతప్రభుత్వ విద్యాశాఖ వ్యయంలో నాల్గోవంతు తగ్గింపు

### విద్యామంత్రి మౌలానా ఆజాద్ ప్రకటన

న్యూఢిల్లీ, డిసెంబరు 6: విద్యాశాఖవారు తమ స్కీములకు చేయదలచిన ఖర్చులో 100 కి 25 వంతులు తగ్గింపబడినదని విద్యాశాఖామంత్రి మౌలానా అజాద్ గారు ప్రకటించిరి. 1949-50 సంll మునకు విద్యాశాఖ ఖర్చు కగాను 587 లక్షలు సంగమంత్రివర్గము వారు సమ్మతించిరని ఈ ద్రవ్యమే చాలా స్వల్పమైయుండ, దేశముయొక్క ఆర్థిక స్థితినిబట్టి దానిలో 153 లక్షల రూపాయలు తగ్గింప బడినవని ఆయన చెప్పెను. అనగా 1949-50 సంll ములో విద్యాశాఖకు 434 లక్షల రూపాయలు మాత్రమే లభ్యమగుననిరి. ఈ విధముగా ఖర్చు తగ్గించుటకు తాను సంతాపముతో అయిష్టతతో అంగీకరించెనని మౌలానాగారు చెప్పిరి. దేశము ఆర్థికముగా చాలా కష్టస్థితిలో నుండుటచేత ఈ తగ్గింపును

(2-వ పేజి చూడుడు)

## ఇండియా ఇండొనీషియాలతో స్నేహఒడంబడికలకు రష్యా యత్నం

### ఆత్మరక్షణకు సోవియట్ ప్రభుత్వ కొత్త ఎత్తులు

న్యూయార్కు, డిసెంబర్ 5:—యుగోస్లావియాలోనికి పాశ్చాత్య దేశాలు ఆటంబాంబులు తీసుకువచ్చాయనే భయంచేత రష్యా ఆత్మరక్షణకు గాను కొత్త ఎత్తులు వెయ్యబోతున్నదని ఈ వేళ యునైటెడ్ నేషన్స్ హెరాల్డ్ అనే పత్రిక వ్రాసింది.

కమ్యూనిస్టులుకానివారు ప్రభుత్వంలో ఉన్నా కొత్త కమ్యూనిస్టు చైనాతో రష్యా మొట్టమొదట ఒక సంధి చేసుకోబోతున్నది.

ఇండియా, ఇండొనీషియా మొదలైన దేశాలతో స్నేహసంధి చేసుకోబోతున్నదట. తూర్పు పడమటి జర్మనీలలో ఉన్న సైన్యాలు తొలగించివేసి జర్మనీని ఉభయులకు రాజ్యంగా చెయ్యాలని కోరబోతున్నదట.

రష్యా అవలంబించబోయే ఈ పద్ధతికి ప్రపంచంలో అంతటా ఉండే కమ్యూనిస్టు పక్షాలు సహాయం చెయ్యగలవని కూడా తెలుస్తున్నది.

ప్రపంచంలో అన్ని చోట్ల రష్యాకు వ్యతిరేకంగా సంఘాలు, రాజకీయ సమ్మేళనాలు జరగడమే రష్యా ఈ కొత్త ఎత్తులు ఎత్తడంకి కారణమని తెలుస్తున్నది. —గ్లోబ్

## టెండరు

తాపేశ్వరం కో-ఆపరేటివ్ క్రాప్ లోన్ & సేల్ సొసైటీ, లిమిటెడ్., తాపేశ్వరం.

పై సంఘస్థలములో ధాన్యము, బెల్లపు కంబైండు గోడౌను కట్టుటకు మెటీరియలు యిచ్చే పద్ధతిని గాని, లేక యివ్వని పద్ధతిని గాని టెండర్లు కోరబడుచున్నవి. గోడౌను యెస్టిమేటు మొత్తము రు 24,000 లు. యెస్టిమేటు, ప్లాను సంఘ ఆఫీసులో చూడవచ్చును. టెండరు ఫారము ఆఫీసులో ఖరీదుకు దొరకును. పూర్తి వివరములను పై సంఘము వారికి వ్రాసి తెలుసుకొనవచ్చును. టెండరు మా ఆఫీసుకు డిసెం 26-12-49 తేదీ లోగా చేరవలెను.

తాపేశ్వరం 4-12-49 } వెనుమర్తి పాపారావు, కార్యదర్శి.

## ప్రకటన

విజయవాడ కాపురస్థులు నాక్ల యింటు దోసపాటి క్రిష్ణమూర్తిగారి తరఫున అందరకు తెలియజేయునది ఏమనగా:

నాక్లయింటున్ను విజయవాడ కాపురస్థుల ప్రాతూరి వెంకటేశ్వరరావుగారున్ను విజయవాడలో సుమారు రెండున్నర సంవత్సరములనుండి జాయింటుగా పొగాకు వ్యాపారము చేయుచూ వచ్చినారు. సదరు జాయింటు వ్యాపారము ఆగిపోయినది. జాయింటుఫరముకు యివ్వవలసిన బాకీలు ఖాతాదార్లు తీసుకుని వచ్చి నాక్లయింటగు దోసపాటి క్రిష్ణమూర్తిగారి యిచ్చి వరం లెక్క బుక్కులలో జమ కట్టించుకొని నాక్లయింటువల్లను క్రమమైన రశీదులను పొందగలరు. అట్లుచేయక వేరు విధముగా బాకీదార్లు ప్రవర్తించేయెడల నాక్లయింటు గాని జాయింటు ఫరముగాని యెంతమాత్రము బాధ్యులు కానేరరు. ఫరము బుక్కులలో జమకట్టబడి యుండని మొత్తములు ఎవరికి యిచ్చినను యిచ్చు వారే నష్టపడెదరు.

పోలేపెద్ది లక్ష్మీనారాయణశాస్త్రి, వకీలు, విజయవాడ.
1 12 49.

## నోటీసు

హుజూరు నగరు తాలూకా దోరకుంట (నైజాం) కాపురస్థుడు లేటు సూరిభొట్ల వెంకటకృష్ణయ్యగారికి నేను భార్యనైయున్నాను. ఆయన మరణకాలము నుండి ఆయనయొక్క స్థిరచరాస్తులు నాకు హిందూ ధర్మశాస్త్ర ప్రకారము సంక్రమించి నా యొక్క సంపూర్ణ స్వాధీన హక్కు భుక్తములలో యుండి యున్నవి. సదరు ఆస్తులయందు మూర్తి లక్ష్మీనారాయణ శాస్త్రిగారి కుమారుడు వెంకటేశ్వరశాస్త్రికి యెట్టి విధమైన హక్కు స్వాధీన భుక్తములు లేవు. అతని తరఫున అతని తండ్రి ఆంధ్ర పత్రికలో 14-11-49 తేదీన చేయించిన ప్రచురణలోని సంగతులు నిజము కావు. అతనికి నా భర్తగారు ఆయన ఆస్తులను యెన్నడున్నూ సంక్రమింపజేసి యుండలేదు.

కూచిభట్ల జానకమ్మ.
3-12-1949.



## రేడియో ప్రోగ్రాములు

డిసెంబరు 8 గురువారం

### మద్రాసు (ఏ)

ఉ|| 7-30 కె. చొక్కలింగం పాట 8-0 ఆంగ్లమున వార్తలు. 8-15 ఉదయ సంగీతం 8-30 మద్రాసు (బి) వలె మ|| 1-0 మద్రాసు (బి) వలె. 1-30 ఆంగ్లమున వార్తలు. 1-40 సినిమా సంగీతం రికార్డులు. 4-30 పాశ్చాత్య సంగీతం రికార్డులు. సా|| 5-30 వి. కజర్ వేలుపిళ్ళె నాదస్వరం. 6-0 ఆంగ్లమున వార్తలు. 6-20 సీతామణి పాట. 7.0 ప్రశ్నోత్తరముల కార్యక్రమం. ఆంగ్లమున. నిర్వహణ: రాయ్ మాక్సి కాల్. 7-30 గీతమంజరి రికార్డులు. 7-45 మదరాసు (బి) వలె. 8-15 రాగం తానం. పల్లవి ఎస్. బాలచందర్ వీణ. 9-0 ఆంగ్లమున వార్తలు. 9-15 చలనచిత్ర సమీక్ష, ఆంగ్లమున ఎ. సీతాదేవి. 9-30 మద్రాసు (బి) వలె 10-0 పాశ్చాత్యసంగీతంరికార్డులు

### మద్రాసు (బి)

ఉ|| 7-0 తెలుగున వార్తలు. 7-15 ఎల్. సి. వసంతకోకిలం రికార్డులు. 7-45 మద్రాసు (ఎ) వలె. 8-30 పుదుకోట్టై కె. కోళందై వయొలిన్. మ|| 12-0 కార్మికుల కార్యక్రమం. 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు ఎవరేమి చేస్తారు. విమానంలో పైలట్, ప్రసంగం టి. కె. లలిత్ వ్యాసం ఆధారంతో. 1-0 మహిళామండలి. 'పద్మావతి' రూపకము. దర్జీ లేకుండా కోలీలు మన్నసునని ప్రసంగం. జి. లక్ష్మీకాంతమ్మ 1-30 మద్రాసు (ఎ) వలె 1-50 తెలుగున వార్తలు. 2-15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు. గణితశాస్త్రజ్ఞ రాణులు. రుద్రమదేవి. ప్రాతినిధ్య వర్గములు పురపాలక సంఘం ప్రసంగం. కె. శ్రీరామమూర్తి 4-0 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు. ఏలా పరిపాలింపబడుతున్నాయి. గ్రామాలు ప్రసంగం. సా. 5-30 మద్రాసు (ఎ) వలె. 6-20 సాయం సంగీతం (రి). 6-30 గ్రామస్థుల కార్యక్రమం. ఏదేశమేగినా రాయప్రోలు గేయం. రాత్రిబడి రూపకము. 7-0 తెలుగున వార్తలు. 7-15 గీతావళి 7-45 అడవిదకాసిన వెన్నెల. అల్లుడు గారికి ధనసహాయం ప్రసంగం. చిం తా దీక్షితులు 8-0 కేరళ దేశపు జానపద గేయాలు. 8-15 మద్రాసు (ఎ) వలె, 9-30 వి. దక్షిణామూర్తి పాట. 10-0 సినిమా రికార్డులు.

### విజయవాడ

ఉ. 7-0 తెలుగున వార్తలు 7-15 చిత్తూరు సుబ్రహ్మణ్యపిళ్లై రికార్డులు 7-30 కోట రామకృష్ణయ్య వయొలిన్ 8-0 ఆంగ్లమున వార్తలు. 8-15 వేణువు క్లారినెట్ నిలయ విద్వాంసులు 8-30 భద్రాచల రామదాసు కీర్తనలు తాడేపల్లి వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రి మ. 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు 1-0 తారాపథం (రి) 1-30 ఆంగ్లమున వార్తలు 1-50 తెలుగున వార్తలు 2-15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు 4-0 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు సా. 5-30 తాడేపల్లి వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రి పాట 6-0 ఆంగ్లమున వార్తలు 6-20 గీతమంజరి (రి) 6-30 గ్రామస్థుల కార్యక్రమం (మద్రాసునుండి) 7-30 జోస్యుల విశ్వనాథం పాట 7-45 నిజానిజ పరిశీలన, ఇల్లు ఇరకాటం ఆలు మరకాటం; ప్రసంగం మునిమాణిక్యం నరసింహారావు 8-0 కరండ పాహిని రూపకము రచన ఎస్. శారదాదేవి 8-15 విజయవాడరేడియో ఆర్కెస్ట్రా 8-30 శ్రోతలుకోరిన రికార్డులు 9-0 ఆంగ్లమున వార్తలు 9-15 చిత్రవాణి (రి) 9-30 కోట రామకృష్ణయ్య వయొలిన్.

### హైద్రాబాదు

ఉ 7-30 బి. ఆర్. దేవ్‌ధార్ శాస్త్రీయ సంగీతం. 8-0 ఆంగ్లమున వార్తలు (ఎ. ఐ. ఆర్. రిలే) 8-20 కర్నాటక సంగీతం 8-50 తెలుగున వార్తలు. 9-15 రామ్‌లక్ష్మీబాయ్ తుమ్రీ ఘజల్ మ. 12-30 ఘజల్ రికార్డులు. 1-0 ప్రణయసుధ (రి) 1-30 ఆంగ్లమున వార్తలు 1-50 తెలుగున వార్తలు సా 5-0 రామ్‌లక్ష్మీబాయ్ తుమ్రీఘజల్ 5-15 బి ఆర్. దేవ్‌ధార్ ఖయాల్ 5-35 రామ్‌లక్ష్మీబాయ్‌ద్వారా భజన్ 6-30 గ్రామస్థుల కార్యక్రమం తెలుగున. అధికోత్పత్తి (రి) మిశ్రిత మాంసములు. సంభావన హాస్యగీతాలు. ఆచార్యకృష్ణ, ఆరోగ్యసూత్రాలు 'అంటువ్యాధులు' డాక్టరు ప్రసంగం. 7-0 తెలుగున వార్తలు (ఎ. ఐ. ఆర్ రిలే) 7-15 భజనకీర్తనలు. పుచ్చా సుబ్బారావు శారదాంబ. వెంకటరాజు. కళ్యాణి. వరదరాజన్. 7.55 సితార్ రికార్డులు. 8-30 కర్నాటక సంగీతం 9-0 ఆంగ్లమున వార్తలు. (ఎ. ఐ. ఆర్. రిలే) 9-15 బి. ఆర్. దేవ్‌ధార్ ఖయాల్. 9-30 రామ్‌లక్ష్మీబాయ్ తుమ్రీ. 9-55 బి ఆర్. దేవ్ ధార్. ఖయాల్. 10-20 రామ్‌లక్ష్మీబాయ్. 10-30 ముంతాజ్ బేగం, రికార్డులు.

## దక్షిణ దేశమున జరుగనున్న టెన్నిసు పందెములు

చెన్నపట్నం, డిసెంబరు 5:— దక్షిణ దేశమున దిగువ పేర్కొన్న టెన్నిసు పందెములు జరుపుటకు రాష్ట్ర లాన్ టెన్నిసు సంఘము అనుమతించియున్నది.

తూర్పుకోస్తా ఛాంపియన్ షిప్పు ఆంధ్ర జింఖానా విజయవాడ 24 డిసెంబరు నుండి 31 వరకు, ఆల్ ఇండియా హార్డు కోర్టు ఛాంపియన్ షిప్పు మదరాసు కార్పొరేషను టెన్నిసు స్టేడియము నందు 1950 జనవరి 16 నుండి 23 వరకు, యస్. వి. ఆర్. అండ్ సన్సు ఛాంపియన్ షిప్పు యస్ వి. ఆర్. అండ్ సన్సు క్లబ్ గుంటూరు. 1950 జనవరి 24 నుండి 29 వ తేదీ వరకు, మదరాసు క్రికెట్ క్లబ్ ఛాంపియన్ షిప్పు యం. సి. సి చేపాక్ మదరాసు 1950 జనవరి 30 నుండి ఫిబ్రవరి 6 వ తేదీ వరకు, సౌత్ ఇండియన్ ఛాంపియన్ షిప్పు కాస్మాపాలిటన్ క్లబ్ కోయంబత్తూరు. ఫిబ్రవరి 6 నుండి 12 వరకు జింఖానా క్లబ్ పందెములు. జింఖానా క్లబ్ మదరాసు ఫిబ్రవరి 14 నుండి 21 వరకు, మదరాసు ప్రెసిడెన్సీ హార్డు కోర్టు ఛాంపియన్‌షిప్పు యస్. ఐ. ఎ. ఎ మదరాసు ఫిబ్రవరి 27 నుండి మార్చి 5 వరకు, లాలీస్ టెన్నిస్ పందెములు లాలీ ఇన్‌స్టిట్యూటు ఊటీ మే 1 నుండి 10 వరకు, వెల్లింగ్టన్ టెన్నిసు పందెములు వెల్లింగ్టన్ జింఖానా నీలగిరులు మే 11 నుండి 21 వరకు.

### ఆల్ ఇండియా హార్డు కోర్టు టెన్నిస్ పందెములు

"మదరాసునందు జనవరి 16 నుండి 23 వరకు జరిగే పై పందెములలో మెన్సు సింగల్సు డబుల్సు, మిక్స్‌డ్ డబుల్సు స్త్రీల సింగిల్సు పోటీలు జరుగ గలవు. దరఖాస్తులు జన 2 వ తేదీ రాత్రి 8 గంటలోగా అందవలెను. పోటీల నిర్ణయము జనవరి 4 వ తేదీ జరుగును. నిఖిల ఆసియా నేషనల్ ఛాంపియన్ షిప్ పందెములలో పోటీ చేసే యోధులకేకాక యీ పందెములలో సహా పోటీ చేయుదురని రాష్ట్ర టెన్నిసు సంఘ కార్యదర్శి శ్రీ యం యస్. సాథిగోపాల్ గారు తెలుపుచున్నారు.

## పాకిస్తానులో హిందువులకు అన్యాయం

మదరాసు, డిసెంబరు 5: సింధి హిందూ రిఫ్యూజీ సహాయసంఘంవారు వై. ఎం. సి. ఏ లో ఏర్పాటు చేసిన బహిరంగ సభకు ఖాసా సుబ్బారావుగారు అధ్యక్షత వహించిరి.

పరసురాం జగానందుగారు స్వాగత మొసంగుచు, పాకిస్తానులో హిందువులందరిని బలవంతంగా ముస్లిము మతములో చేర్పుకొనుచున్నారనియు, హిందువులు విడచిన ఆస్తులను లూటీచేస్తున్నారనియు చెప్పిరి.

ఇండియాలోనున్న వారు పాకిస్తానులో ఆస్తులు చేయనివ్వరాదనియు, పాకిస్తాను యెడల సానుభూతి గలవారి ఆస్తులన్నీ కూడా ఇండియా ప్రభుత్వంవారు తీసుకోవాలనియు, సభలో తీర్మానించబడెను. శ్రీ. ఖాసాసుబ్బారావుగారు ఉపన్యసించుచు, ఇండియాలో నున్న ముస్లిముల ఆందోళనవల్లనే పాకిస్తాను ఏర్పడినదనియు ఇండియాలో విడచిపోయిన ముస్లిముల ఆస్తులను ఇండియా ప్రభుత్వం కాపాడినట్లు పాకిస్తాను ప్రభుత్వం అచటి హిందువుల ఆస్తులను కాపాడుట లేదనియు, ఈ విషయమై ఇండియా ప్రభుత్వంవారు తగు శ్రద్ధ తీసుకొనవలెననియు చెప్పిరి

## షాపులు దుకాణముల చట్టము

### బ్యాంకులను మినహాయించుచు ప్రభుత్వ వుత్తర్వు

మదరాసు, డిసెంబరు 5: రాష్ట్రము లోని బ్యాంకులన్నిటినీ షాపులు దుకాణముల చట్టము సెక్షన్ 13 (1) నుండి మినహాయించుచూ ప్రభుత్వము వుత్తర్వు చేసెను.

అర్ధసంవత్సరము, సంవత్సరాంతలెక్కలు తీయురోజులకు, అంతకుపూర్వము, దరిమిలా మూడురోజులకు ఈ మినహాయింపు వర్తించును. రోజుకు 8 గంటలు, లేక వారమునకు 48 గంటలకు మించి పని చేయు ఉద్యోగికి మామూలుగ ఇచ్చేదానికి రెట్టింపు ఇవ్వవలెను.

బ్యాంకుల అకౌంటెంటులు, ఛీఫ్ కాషియర్‌ను షాపులచట్టము అన్ని వరతులనుండి మినహాయించుచూ ప్రభుత్వము వుత్తర్వు చేసెను.

## ఉద్యోగవార్తలు

మదరాసు, డిసెంబరు 5: శ్రీ టి. వి. వెంకట్రామఅయ్యర్ తాత్కాలికముగా కర్నూలుజిల్లా విద్యాధికారిగా చార్జి తీసుకొనునాటినుండి నియమించబడిరి.

## తిరుపతిలో మ్యూజియం స్థాపన నిర్ణయం

### సంస్కృతశబ్దార్థ సర్వస్వం తయారుచేయాలనియోచన

తిరుపతి, డిసెంబరు 4: తిరుపతి వెంకటేశ్వర ప్రాచ్యభాషా పరిశోధనాలయపు సలహా సంఘము నేటిదినం కె. వంకట స్వామినాయుడుగారి అధ్యక్షతన సమావేశమైనది.

తాళ్ళపాక అన్నమాచార్య విరచితమైన కీర్తనలను ప్రజలలో ప్రచారం చేయుటకు అఖిలభారత రేడియో డైరెక్టరు గారిని సలహాలు కోరుటకు తీర్మానించారు. ముందు తిరుపతిలోనే ఈ కార్యక్రమమును ప్రారంభించవలసినదిగా వారిని కోరుటకుకూడ తీర్మానించారు.

గత వేసవిలోవలెనే రాబోవు వేసవి కాలంలోకూడ ఒక నెల రోజులపాటు, రోజుకు 4 ఉపన్యాసములు చొప్పున పాఠశాల నడపవలసిందిగా వారు తిరుపతి దేవస్థానం వారికి సిఫార్సు చేశారు.

ప్రస్తుతం సంస్కృత భాషకు ఒక శబ్దార్థ సర్వస్వము మిక్కిలి ఆవశ్యకమని, దానిని తయారుచేయించి ముద్రించుటకు కూడ వారు తీర్మానించారు.

తిరుపతిలోను, పరిసరాల్లోను దొరకిన విగ్రహములు, ప్రాచీన నాణెములు, తామ్రశాసనములు, చిత్రములు, శిల్పములు, స్తంభములు మున్నగువానిని చేర్చి ఒక మ్యూజియమును ఈ సంవత్సరం లోపుగానే ప్రారంభించుటకు తీర్మానించారు.

నన్నయ్యకు పూర్వం గల ఆంధ్ర వాఙ్మయమునుగూర్చి ప్రస్తుతం పరిశోధనా గ్రంథం రచిస్తున్న వేటూరి ప్రభాకర శాస్త్రిగారిని, అది పూర్తిఅయినతర్వాత 'లక్షణోద్ధార' అను గ్రంథమును వ్రాయమని వారిని కోరుటకుకూడ నిశ్చయించారు.

## తిరుపతిలో తుపాను బాధితుల సహాయ సంఘం

తిరుపతి, డిసెంబరు 4: ఆంధ్ర తుపాను బాధితుల సహాయ నిమిత్తము నేడిక్కడ రాయలసీమ బ్యాంకి ఏజెంటు కె. నారాయణ రావుగారి అధ్యక్షతన జరిగిన బహిరంగ సభలో, ద్రవ్యసేకరణ కొరకు ఒక సంఘం నియమింపబడింది. దీనికి దేవస్థానం కమీషనర్ సి. అన్నారావు గారధ్యక్షులు, కె. నారాయణ రావు, ఆర్. పార్థసారథి నాయుడు గారలు కార్యదర్శులు, ఇ. పుల్లయ్య సెట్టి గారు కోశాధికారిగా నియమింపబడ్డారు. స్వ. వి

## తిరుపతి తిరుమల ఘాట్‌రోడ్డు మరమ్మతు

తిరుపతి, డిసెంబరు 3: తిరుపతికి తిరుమలకు మధ్య ఘాట్‌రోడ్డును బాగుపరచుటకు తిరుపతి, దేవస్థాన సంఘంవారు నేడు 7 లక్షల రూ. మంజూరు చేశారు.

## మదరాసు వార్తలు

మదరాసు, డిసెంబరు 5:— స్టాన్లీ ఆస్పత్రి మెడికలు కాలేజీకి సిబ్బందికొరకు యిండ్లు కట్టించుటకు మదరాసు ప్రభుత్వం వారంగీకరించి, ప్రక్కన నున్న రాబిన్‌సను పార్కులోని జాగా, ఎదురుగనున్న పి. డబ్ల్యు. డి వర్కుషాపునందు జాగా నేడు ఇంజనీరులు తనిఖీ చేసిరి.

సరోజిని (16) అను యువతి చాకలిపేటలో తనయింట పూజ చేస్తూ చీరకంటుకొనగా కాలి ఆస్పత్రిలో చేర్చబడెను.

[illegible] డిపాల్మెంటని వారం [illegible] సెలవు చట్టమునుండి ప్రభుత్వం వారు మినహాయించిరి.

## కార్పొరేషను ఖర్చులు

మదరాసు కార్పొరేషను ఆదాయ వ్యయపట్టికను పరిశీలించి, సంఖ్యలను యించుక సవరించి మదరాసు ప్రభుత్వం వారు రూ 13. 48 లక్షల లోటున్నదనియు, సిబ్బంది నెక్కువచేసియు కార్మికులకు ఎక్కువ యిచ్చియు ఖర్చులు పెంచిరనియు, లాభంలేని స్కీములన్నీ నిలుపు చేసి ఖర్చులు తగ్గించుకొన వలెననియు సూచించిరి

### శ్రీ చంద్రమౌళిగారి పర్యటన

స్థానిక శాఖామంత్రులు శ్రీ కల్లూరు చంద్రమౌళి గారు 7 వ తేదీ రాత్రి బయలుదేరి తెనాలి వెళ్లెదరు. 9 రాత్రి బయలుదేరి 10 ఉదయము మద్రాసు చేరెదరు.

మార్కాపురం తాలూకా రైతు కాంగ్రెసు మహాసభ, 7 వ తేదిన మార్కాపురంలో జి. [illegible]గారి యధ్యక్షతన జరుగుతుంది.

## కృష్ణలంకలలో సంజీవ రెడ్డిగారి పర్యటన

### రైతు పరిస్థితుల పరిశీలన

బందరు, డిసెంబరు 3: జిల్లాలోని ఎక్కువ లంకల సమస్యలను స్వయంగా పరిశీలించుటకు గాను మద్రాసు మద్య నిషేధ మంత్రి నీలం సంజీవరెడ్డిగారు నిన్న ఇక్కడకు వచ్చారు.

బందరు, డిసెంబరు 3: తుపాను బాధిత ప్రదేశాలు చూచుటకు మంత్రి గారు నిన్న ఉదయం బందరునుంచి బయలుదేరి కాంగ్రెసు ప్రముఖులు వివిధ శాఖల ప్రభుత్వోద్యోగులతో కలసి శ్రీ కాకుళక్షేత్రము వెళ్లారు.

అటనుంచి కాకులకు స్వస్తి చెప్పి మంత్రి గారు కృష్ణవేణీ నదీ గర్భములోని మిట్ట మధ్యాహ్నము 12 గంటలప్పుడు మోటారులో లంకల యడకలో ప్రయాణము సాగించారు. ఈ సీమ కాంగ్రెస కార్యకర్తలు శ్రీమతి సీతామహాలక్ష్మమ్మగారు వెంటనుండి పరిస్థితులు వ్యక్తపరుస్తుండగా మంత్రి గారు రెల్లు దిబ్బ, వంకి దిబ్బ, వెంకయ్య దిబ్బ, రావిలంక మున్నగు కృష్ణ లంకలను చూచి, గం 1-30 లకు పోతార్లంక గ్రామము చేరారు.

ఈ లంకలలో అడవులను ఛేదించి క్రొత్తగా వ్యవసాయము చేస్తున్న రైతులను కల్సుకొని వారి పరిస్థితులను అడిగి తెలుసుకొన్నారు. అక్కడ ఛేదించి గుట్టలుగా పెట్టబడిన మేలు రకము కలపను చూచారు. జిల్లా ఫారెస్టు ఆఫీసరుతో పరిస్థితులు చర్చించారు

మంత్రిగారు ప్రశ్నింపగా కొందరు రైతులు తాము ఎకరానికి రు 450 చొప్పున ధనము చెల్లించి యీ భూములను కొలుకు తీసుకున్నామనీ యిది రెండు సంవత్సరాలకు కౌలనీ, దీనిని ఆరేడు కుటుంబాల వారము కలసి తీసుకున్నామనీ, తామిచ్చిన మొత్తమునకు రశీదులు ముట్టలేదనీ రు 6 ల శిస్తు నిర్ణయ విషయమై మాత్రము కాగితమున్నదనీ చెప్పారు.

మంత్రిగారికి పోతార్లంక గ్రామస్థులు ఘనంగా ఆతిథ్యమిచ్చారు. గౌడులూ, యితర గ్రామస్థులూ తమకు భూములిప్పించవలసిందిగా కోరుతూ అర్జీలు దాఖలుచేశారు. రెడ్లు గ్రామస్థులకు తగు సలహాలిచ్చారు.

అటనుంచి 10 ఎడ్ల బండ్లపై మంత్రి గారునూ వారి అనుచరులునూ [illegible] పాలెం చేరారు. అచట పెద్దసభ జరిగింది. పలువురు రైతులు తమ యిక్కట్టులను వక్రిస్తా అర్జీలు దాఖలుచేశారు. రాజకీయ పరిస్థితులనుగూర్చి, కమ్యూనిస్టు జెనరల్ గూర్చి రైతుల కర్తవ్యమునుగూర్చి తాము (ప్రభుత్వము) చేయనున్న సహాయములను గూర్చి మంత్రిగారు ప్రసంగించారు.

శ్రీమతి సీతామహాలక్ష్మమ్మ, కోడాలి ఆంజనేయులుగారు స్థానికముగా ప్రజల యిక్కట్టులనుగూర్చి విపులముగా వివరించారు. దివితాలూకా సంచారము జయప్రదముగా జరిపినందుకు తాలూకా కాంగ్రెసు కార్యదర్శి డి. మధుసూదన రావు గారు మంత్రి గార్కి వందనము లర్పించారు. కోరినంతనే జిల్లాకువచ్చి తూర్పు కృష్ణ నాల్గు తాలూకాలూ చూచి తుపాను దెబ్బ, వరదముంపు, మురుగుకాల్వలబాధ, జమీరైతుల యిక్కట్లు స్వయముగా పరిశీలించినందుకు మంత్రిగార్కి వల్లభనేని రామబ్రహ్మంగారు అభినందించారు. కొల్లి శేషయ్య గారింట అల్పాహారము స్వీకరించి తిరిగి బళ్ళపై ప్రయాణించి తిప్పలకట్ట పాట్లంకల మీదుగా ఏటిగట్టుకు చేరారు.

రాత్రి 9 గంటలకు పడవపై కృష్ణానదిని దాటి నడకుదురువద్ద కారు లెక్కి బెజవాడ చేరుకున్నారు. ఈ సంచార కార్యక్రమములో జిల్లా కాంగ్రెసు అధ్యక్షులు మాగంటి అంకినీడు మున్నగు పలువురు కాంగ్రెసు ప్రముఖులు మంత్రిగారి వెంటనున్నారు.

ఎన్నడూ ఏ ప్రభుత్వ నిర్వాహకులూ కాలుమోప సాహసింపని యీ మారుమూల లంకభూములకు మంత్రి సంజీవరెడ్డి గారు, శ్రీమతి సీతామహాలక్ష్మమ్మగారు నూ 50 మంది హరిజనులునూ వెంటరాగ క్రింద కాళ్లతో పైన నెత్తి మాడుచుండగా ముళ్లడొంకలలోనూ, రెల్లుదుబ్బులలోనూ 7.8 మైళ్లు నడచి, మరి అంత దూరము మోటుబండ్లపై ప్రయాణించివచ్చి తమ యోగక్షేమములను స్వయముగా తెల్సుకున్నందులకు యీ సీమప్రజలు హర్షపులకితులైనారు. (స్వ. వి.)

## సభలుసమావేశములు

గుంటూరు జిల్లా నూర్‌బాష్ సంఘ కార్యవర్గ సమావేశము డిసెంబరు 8 న గుంటూరు మునిసిపల్ రహదారి బంగళా షేక్ [illegible] సాహెబుగారి అధ్యక్షతన జరుగును.

మార్కాపురం తాలూకా కాంగ్రెసు సర్వసభ్య ప్రాథమిక కాంగ్రెసు పంచాయితీ అధ్యక్ష కార్యదర్శుల సంయుక్త సమావేశము, యీ నెల 7 వ తేదీన మార్కాపురం రహదారి బంగళాలో జరుగుతుంది.



భారత్ ఇన్స్యూరెన్సు కంపెనీ లిమిటెడ్.
మౌంట్ రోడ్డు,
మద్రాసు.

అయ్యా,

లేటు ఎస్. దొరస్వామిగారి తాలూకు 82471, 147345 పట్టానంబర్ల క్లెయిము గురించి.

పైన తెలిపిన పట్టాల క్లెయిముల పరిష్కారము క్రింద రు 27,988-2-0 ల చెక్కుతో, మీరు పంపిన 33065 నెంబరుగల 10-10-1949 తేదీ ఉత్తరమునకు వందనములు.

మొత్తము పెద్దదైనప్పటికీ, మీరు క్లెయిములను శీఘ్రముగా పరిష్కరించినందులకు ప్రశంసించుచున్నాను. మీ హెడ్డాఫీసు ఢిల్లీలో నుండుట బట్టియు, అనుసరించవలసిన లాంఛనములను బట్టియు, కొంత ఆలస్యమగునని అనుకొంటిని. మీరు గావించిన శీఘ్రపరిష్కారము, మర్యాద ధీయా దారుల ప్రశంసకు పాత్ర మగుటయేగాక, పట్టాదారులకు ప్రశస్తమైన యోగ్యతాపత్రముగా నుండగలవు.

45, బజ్‌లుల్లా రోడ్డు, త్యాగరాయనగరు, మద్రాసు 11-10-49. | మీ విశ్వాసపాత్రురాలు, (సం) శ్రీమతి జయలక్ష్మి.

# ఆంధ్రరాష్ట్ర నిర్మాణం: మద్రాసుప్రభుత్వ బాధ్యత

## 'జనవరి 26 లోగా ఏర్పాట్లు పూర్తి కావాలి' కళా వెంకట్రావుగారి వివరణ

చెన్నపట్నం, డిసెంబరు 6: జనవరి 26 వ తేదీలోపల ఆంధ్రరాష్ట్రం మెడ్యూలులో చేర్చటానికి ఆంధ్రరాష్ట్రం ఏర్పడి అమలులో ఉండవలెననియు, గవర్నరు జనరల్ ఉత్తర్వు వచ్చినంత మాత్రమున చాలదనియు జనవరి 26 లోపల ఆంధ్రరాష్ట్రం రాకపోతే సాధ్యమైనంత త్వరలో రాగలదనియు అఖిలభారత కాంగ్రెసు కార్యదర్శి కళా వెంకట్రావుగారు నిన్న సాయంత్రం ఢిల్లీనుంచి వచ్చిన తరువాత ప్రభుత్వం అతిథి గృహమున జరిగిన పత్రికా ప్రతినిధుల సమావేశములో తెలిపిరి. ఏప్రెల్ 1 వ తేదీకైతే భారత ప్రభుత్వ అకౌంట్సు శాఖవారికి తృప్తికరమని వెంకట్రావుగారు తెలిపిరి.

స: నేనెల్లాంటి విశేషమూ వాడలేదని గుర్తుంచుకోండి. మద్రాసు ప్రభుత్వమూ, విభజనసంఘమూ మద్రాసులో ఆంధ్రుల రాజధాని ఉండవచ్చునని తీర్మానించినట్లయితే మద్రాసురాష్ట్ర రాజధానీ నగర స్వతంత్రతహక్కు ఏమీ మొక్కపోకుండా మేము ఇక్కడే ఉండి కొత్త రాజధాని వచ్చేదాకానో, కొన్నాళ్ళ దాకానో పరిపాలన సాగించుకుంటాము.

ప్ర: అందులో భిన్నాభిప్రాయాలు వస్తే? కేంద్రానికి వ్రాసి వారు చెప్పిన ప్రకారం నడుస్తారా?

స: భిన్నాభిప్రాయాలు రావనీ, అంతా ఏకాభిప్రాయంగానే నడిపించగలమనీ నా విశ్వాసం. మిత్రులవలె, సుహృద్భావంతో విడిపోదలిచాము. ఉభయపక్షాలకూడా సరసులూ, సజ్జనులైన పెద్దమనుష్యులూ, కష్టసుఖాలు అర్థంచేసుకోగలవారు ఉన్నారు. ఉభయపక్షాలు అట్టి స్నేహభావాన్ని, సుహృద్భావాన్ని ప్రదర్శిస్తే ఈ సమస్య పరిష్కారంగావడం కష్టంకాజాలదు.

ప్ర: మంత్రులు కలసిమెలసి ఉంటు...

## అ. భా. కాంగ్రెసు కార్యదర్శి పర్యటన కార్యక్రమము

## రాష్ట్ర భాషా మహా విద్యాలయం

## "బళ్లారిజిల్లాను పూర్తిగా ఆంధ్రరాష్ట్రంలో చేర్చాలి"

## బళ్లారిపట్టణ ఆంధ్రుల తీర్మానం

## విజయవాడ ఆంధ్రపత్రిక విలేఖరికి తెల్పిన వివరాలు

## బళ్లారి జిల్లాయందలి మూడు తాలూకాల భవిష్యత్తు

## మద్రాసుప్రభుత్వ శ్రద్ధ

## "చిత్తూరుజిల్లా ప్రజలలో తగాదాలు సృష్టిస్తూ తమిళులు దుష్ప్రచారం చెయ్యటం సబబుగాదు"

## జిల్లాబోర్డు అధ్యక్షుని ప్రసంగం

## ఇంకా ముగ్గురు కర్ణాటక శాసనసభ్యుల రాజీనామా

## శ్రీకాకుళంలో పంచదారకఱవు

## శ్రీకాకుళంలో కలరా

## కృష్ణాజిల్లా సరిహద్దులలో కమ్యూనిస్టులకిరాతకచర్యలు

## డిసెంబరు 1,2 తేదీల్లో 3 హత్యలు

## లంకపల్లిలో ఇద్దరి హత్య

## పొన్నూరులో సంస్కృత కళాశాల

## స్థాపనావకాశాల విచారణకు అధికారి నియామకం

## పొన్నూరులోబియ్యంకొరత

## మద్యనిషేధంకింద శిక్షలు

## కాళికాపురం పంచాయితీ బోర్డు

## తిరుత్తనిలో ఆంధ్ర సమ్మేళన ప్రయత్నాలు

## డి. మునిరత్నంనాయుడు గారి విజ్ఞప్తి

## మదరాసు ధరలు

మదరాసు, డిసెంబరు 6:

బంగారు - వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు పవరను 1-కి ఎక్స్ఛేంజి బొంబాయి సేల్సుటాక్సుతోసహా రు. 6-12-0 పెట్టి బంగారు తులం 114-12-0 మూపబంగారు 113-0-0 సీమవెండి తులం 1?0-కి (రెడి 172-0-0 తులం 1-కి 1-12-0

వేరుసెనగ: (581 పా 1-కి ఎక్స్ కోస్తాగిడ్డంగులు) మెషిన్ (సేల్సుటాక్సుతో సహా) బజారు కొత్తది. రు. 161, 161-8-0 168-0-0 (కాండిప్)

వేరుసెనగనూనె ఎక్స్ మిల్లర్ (వివరేజ) 3% యఫ్. యఫ్. ఏ., రు. 330-0-0

కొంకాయనూనె (87 పౌన్లుగల డబ్బా) ఒకటికి కొచ్చిన్ క్వైలాన్. రు. 33-10-9, 34-10-9

ఆముదం

గాండీ 500 పౌనుగలది రు. 260, (ఒంగోల్) (నరసరావుపేట) రు. 250

పంచదార

| | | |
|---|---|---|
| నర్కటాగంజి (2బందరు) | | రు. 94-9-5 |
| హసన్‌పూర్ | ,, | రు. 94-7-10 |
| మోతీపూర్ | ,, | రు. 93-14-0 |
| చిల్లరధర | వీశ 1-కి | 1-5-3 |

## న్యూయార్కు దూది

న్యూయార్కు, డిసెంబరు 5.

డిసెంబ 30.28 / 30 29 మార్చి 30.27 / 30.28 మే 30.18 / 30.19 జూలై 29.74 / 29.74 అక్టోబర్ 28.26 / బిడ్ 28.28 అస్కడ్ డిసెంబరు 28.15 / బిడ్ 28.18 అస్కడ్ మార్చి 28.03 / 28.03 మే 28.00 / 28 00

| | | |
|---|---|---|
| స్పిడ్లింగ్ | పోజరు | 30.95 |
| మార్చి | (గరిష్టధర) | 30.32 |
| | (కనిష్ఠధర) | 32.28 |

## గంటల పంచాంగం

విరోధి సం॥ మార్గశిర బ॥ విదియ 1949 సం॥ డిసెంబరు 7 బుధవారం బ॥ విదియ రా 10-28 ఆర్ద్ర తె 5-43 వర్జ్యం ప 1-24 ల 3-4 వ.

బ॥ తదియ డిసెం॥ 8 గురువారం గు॥ తదియ రా 10-44 పున 24-0 వర్జ్యం సా 6-4ల 7-43 వ.

ఆంధ్రపత్రిక

విరోధి సం॥ మార్గశిర బ॥ విదియ బుధవారం

## ఆంధ్రరాష్ట్ర నిర్మాణ విధానము

"భారతప్రభుత్వము నాయకత్రయ నివేదికను ఆమోదించెను. ఆ నివేదికను అనుసరించియే ఆంధ్ర రాష్ట్రము విషయమున కొన్ని చర్యలు తీసుకొనుట జరిగినది. ఆ నిర్ణయమును ఏ విధముగ అమలు జరుపవలెనను విషయమును ప్రస్తుతము ఆంధ్రులు, తమిళులు విచారించుచుండిరి. వివరములపై వారుభయులు సమాధానమునకు వచ్చినట్లు తెలువగనే ఆంధ్రరాష్ట్ర నిర్మాణము విషయమున ముందుకు సాగిపోగలము." అని భారత ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ మొన్న ఢిల్లీ పత్రికా విలేఖరుల సభలో చేసిన ప్రకటనను బట్టి ఆంధ్రరాష్ట్రము ఇప్పటి రాజ్యాంగ చట్టములోని 290 సెక్షను ప్రకారము ఏర్పడునా లేక 1950 జనవరి 26 అనంతరము నూతన రాజ్యాంగములోని 3 వ సెక్షను ప్రకారము ఏర్పడునా యను విషయము పూర్తిగ కేంద్ర ప్రభుత్వ హోం శాఖా కార్యదర్శి ఉత్తరువు ప్రకారము రాష్ట్ర మంత్రి వర్గము ఏర్పాటుచేసిన ఆంధ్ర, ఆంధ్రేతర ప్రతినిధుల సంఘ నిర్ణయములపై యాధారపడియుండునని స్పష్టమగుచున్నది. పండిట్ నెహ్రూ ఢిల్లీలో ఈ ప్రకటన చేసిన రోజుననే అఖిల భారత కాంగ్రెస్ కార్యదర్శి శ్రీ కళా వెంకట్రావుగారు చెన్నపట్నములో పత్రికా విలేఖరులతో ఇదే విషయమై ప్రసంగించుచు, 1935 వ సంవత్సరపు భారత ప్రభుత్వ చట్టమునందలి 290 సెక్షను ప్రకారము ఆంధ్రరాష్ట్ర మేర్పడకున్న నూతన రాజ్యాంగములోని 3 వ సెక్షను ప్రకారము ఏర్పడగలదని 'హామీ' నిచ్చిరి. శ్రీ వెంకట్రావుగారి వివరణను బట్టి 1950 జనవరి 26 లోపున గవర్నరుజనరల్ ఉత్తరువు ద్వారా ఆంధ్రరాష్ట్ర మేర్పడదని భావింపవలసి వచ్చుచున్నది.

భారత ప్రభుత్వాభిప్రాయము కూడ ఇట్లేయున్న, ఆంధ్రరాష్ట్రము నూతనరాజ్యాంగమును అనుసరించి ఎన్నటికి ఏర్పడగలదో చెప్పుట సాధ్యముగాదు. కనుకనే కాంగ్రెస్ అధ్యక్షుడు డాక్టర్ పట్టాభి సీతారామయ్యగారు ఆంధ్రులు నాయకత్రయ నివేదికను అంగీకరించి నూతన రాజ్యాంగము అమలు జరుగుటతో ఆంధ్ర రాష్ట్ర అవతరణకు దోహదము చేయవలెనని పలుమార్లు హెచ్చరించియుండిరి. అట్టి యవకాశము గలదను విశ్వాసముతోనే ఆంధ్రులు నాయకత్రయ నివేదికను అంగీకరించి, చెన్నపట్టణముపై తమ హక్కులను వదులుకొనిరి. ఆంధ్ర రాష్ట్ర మింతలో ఏర్పడగల యవకాశము లేకున్న ఇప్పుడే ఐచ్ఛికముగ ఆంధ్రులు చెన్నపట్టణమును వదులుకొనియుండరు కనుక నాయకత్రయ సంఘముగాని, కేంద్ర ప్రభుత్వముగాని అన్నమాటకు నిలబడియుండదలచిన జనవరి 26 లోపుగ గవర్నరుజనరల్ ఉత్తరువు జారీయగుటకు నూతన రాజ్యాంగమునందలి రాష్ట్రముల జాబితాలో ఆంధ్రను పేర్కొనుటకు వీలుగ అవసర చర్యలు తీసుకొనవలసియుండును.

ఆంధ్రరాష్ట్రము ఏర్పడి, కొనసాగుచుండినగాని నూతన రాజ్యాంగమునందలి రాష్ట్రముల జాబితాలో పేర్కొనుట సాధ్యము గాదని, జనవరి 26 లోపున ఆంధ్ర రాష్ట్ర మేర్పడి, వ్యవహరించుట సాధ్యముగాదని కనుక ఆంధ్ర రాష్ట్రము నూతన రాజ్యాంగము ప్రకారమే ఏర్పడవలసియుండునను అభిప్రాయము ప్రబలుచున్నది. కాని 1936 మార్చి 3 వ తేదీన బ్రిటిష్ సార్వభౌముడు ప్రత్యేక ఉత్తరువు ద్వారా, సింధు ఒరిస్సా రాష్ట్రములను సృష్టించుటకు పూర్వమే 1935 వ సంవత్సరపు భారత ప్రభుత్వ చట్టమునందలి 46 వ సెక్షనులోని 1 వ సబ్ సెక్షన్‌లో నుదహరించిన రాష్ట్రములలో సింధు, ఒరిస్సా నమోదు అయి ఉండెను. తరువాత 1935 వ సంవత్సరము భారత ప్రభుత్వ పరిపాలనా చట్టమును అనుసరించియే 290 సెక్షను క్రింద సింధు, ఒరిస్సా రాష్ట్రముల స్థాపన ఉత్తరువులు జారీ ఆయి ఉండెను. ఆంధ్రరాష్ట్రము విషయమున ఇట్టిది ఎందులకు సాధ్యముగాదో తెలియకున్నది. నూతన రాజ్యాంగము అమలుకు వచ్చుటకు పూర్వము ఆంధ్రరాష్ట్ర నిర్మాణము విషయమున ప్రభుత్వమొక నిర్ణయమునకు వచ్చిన, ఆ నిర్ణయమును పురస్కరించుకొని ఆంధ్రను రాష్ట్రముల జాబితాలో పేర్కొనుట కెట్టి అభ్యంతరము ఉండజాలదు.

అయితే 1935 వ సంవత్సరము శాసనము ఆమోదమునకును, అమలుజరుగుటకును మధ్య వ్యవధి యున్నదని, అట్టిది ఇప్పుడు లేదని కనుక సింధు, ఒరిస్సాలను పేర్కొనినట్లు జనవరి 26 నుండి అమలుజరుగు నూతన రాజ్యాంగమున ఆంధ్రను పేర్కొనుట సాధ్యముగాదనవచ్చును. ఆ ప్రతిబంధకమును అధిగమించుటకు గవర్నరు జనరల్ ఉత్తరువునందే ఆంధ్రరాష్ట్రము ఏ నిర్ణీత తేదీనుండి అమలుకు వచ్చునో స్పష్టము చేయవచ్చును. ఆనాటి నుండియే నూతన రాజ్యాంగ నిబంధనలు ఆంధ్రరాష్ట్రమునకు వర్తించుననికూడ స్పష్టము చేయవచ్చును. తదనుగుణముగ పరిషత్తు అధ్యక్షుడు రాజ్యాంగ నిబంధనలను సవరింపవచ్చును.

ఆంధ్రనాయకులు, రాష్ట్ర మంత్రివర్గ మేర్పరచిన సంఘమునందలి ఆంధ్ర సభ్యులు, ఒక్క విషయమును గమనింపవలసియున్నది. విభజన ఎప్పుడు జరిగినను, జనవరి 26 లోపుగ ఆంధ్ర రాష్ట్రనిర్మాణఉత్తరువు జారీయగుటకు అవసరమైనట్టి యాపత్తు చర్యలు తీసుకొనవలసియుండును. అట్టిది జరుగకున్న నూతన రాజ్యాంగమును అనుసరించి రాష్ట్రము 1950 ఏప్రిల్ 1 వ తేదీ లోపున ఏర్పడగలదను విశ్వాసమునకు తగిన ఆధారములు లేవు. రాష్ట్ర ప్రభుత్వము, కేంద్రప్రభుత్వము ఆంధ్రరాష్ట్రనిర్మాణమునకు ఒప్పుకొనియున్నందున నూతన రాజ్యాంగమును అనుసరించి పార్లమెంటు ద్వారాఅయినను ఆంధ్రరాష్ట్రము త్వరగా ఏర్పడగలదని శ్రీ వెంకట్రావుగారు అభయమిచ్చుచున్నను గతానుభవమునుబట్టి అది సాధ్యముగాదనిపించును. కాలహరణమైనకొద్ది నేడు సులభముగ పరిష్కారము కాగల సమస్యలు క్లిష్టమై పరిష్కారమునే ప్రతిఘటింపవచ్చును.

కనుక చెన్నరాష్ట్రప్రభుత్వము నియమించిన సంఘమువారు సె. 290 ప్రకారము ఆంధ్రరాష్ట్ర స్థాపన జరుగుట యవసరమని తీర్మానించి, ఏప్రిల్ 1, 1950 నాటికి ప్రత్యేకాంధ్రప్రభుత్వము 'నోషనల్' విభజన ప్రకారము ఏర్పడవచ్చునని కేంద్రప్రభుత్వమునకు సూచింపవలసి యుండును. ఆస్తి, అప్పుల విభజన సావధానముగ జరుగవలసి యుండును. మున్ముందు వివాదములకు ఆస్కారము లేకుండ ఈ విభజన అన్ని పక్షములకు తృప్తికరముగ నుండునట్లు జరుగవలెనన్న జనవరి 26 వరకువున్న వ్యవధి చాలదు. భారతప్రభుత్వమునకైనను ఈ విషయము తెలియనిదిగాదు. ఆంధ్ర రాష్ట్రరాజధాని తాత్కాలికముగనైనను చెన్నపట్నమునందుండుట తప్పనిసరి గనుక ఉభయ ప్రభుత్వములు పరస్పర సంప్రతింపులతో సామరస్యధోరణిలో వివాదాస్పదమైన అన్ని వ్యవహారములను పరిష్కరించుకొనవీలగును. ఈ విషయము లన్నింటిపై ఆంధ్ర, ఆంధ్రేతర ప్రతినిధులకు సమాధానము కుదురుట అసాధ్యమైన విషయముగాదు. సమాధానము కుదిరిన వెంటనే రాష్ట్రనిర్మాణము విషయమున కేంద్రప్రభుత్వము ముందుకు సాగిపోగలదని ప్రధానమంత్రి వాగ్దానము చేసినందున నూతన రాజ్యాంగమునందలి రాష్ట్రముల జాబితాలో ఆంధ్రను పేర్కొనుట సాధ్యమగునని యే ఆశించుచున్నాము.

## నెహ్రూ వివరణ

(1 వ పేజీ తరువాయి)

నట్లు తెలుస్తున్నది. ఇందు విషయమై మీ అభిప్రాయ మేమిటి?

నెహ్రూ:- ప్రభుత్వం నాయకత్రయ నివేదికను అంగీకరించింది. దాన్నిబట్టే, దానిలోవున్న కొన్ని అంశాలను ఆంధ్రులు వప్పుకున్న అనంతరం, కొన్ని చర్యలు తీసుకోవటం జరిగింది. దీన్ని ఆచరణ సాధ్యం చేయటానికి గల మార్గాన్ని గురించి ఆంధ్రులూ తమిళులూ ఆలోచిస్తున్నారు. వివరాల విషయంలో సమాధానము కుదిరితే ఈ కార్యక్రమాన్ని ముందుకు కొనసాగించుతాం. యితర ప్రాంతాల విషయంలోకూడా నాయకత్రయ నివేదిక ననుసరించి ఒడంబడిక కుదిరే సావకాశం వుంటే, ఆ వ్యవహారాన్నికూడా కొనసాగించటం జరుగుతుంది. అలాంటిది సాధ్యంగాని పక్షంలో, ఒకరేదో వొత్తిడి చేస్తున్నారని రెండో పక్షంవారిని బలవంతపెట్టడంమాత్రం జరగదు. ఎందుచేతనంటే అలాటిచర్యవల్ల యే సమస్యా పరిష్కారంకాదు.

ప్రశ్న: ఉభయపక్షాలకు ఒడంబడిక కుదరాలని మీరు సెలవిస్తున్న ఈమాటకూ హిందూముస్లిములు రాజీపడండి అని వెనక బ్రిటిష్ ప్రభుత్వం అన్నమాటకూ తేడా యేమిటి? రెండూ ఒకటే పంథలో లేవా?

నెహ్రూ:- అలావున్నాయని నేనను కోను. ఇది ఒకదాన్ని విభజించేసమస్య. ఎంత శాంతియుతంగా చేసుకున్నా, పనకాముందూ సరిగా యోజించకుండా హఠాత్తుగా ఈవిభజన చేసి వేసినట్లయితే, అది అనంతరం అనేక చిక్కులకు, సంఘర్షణలకూ కారణమౌతుంది. అందుకనే 'మీలోమీరే తేల్చుకోవటం మంచిదని మేము చెబుతున్నాం. ఇప్పట్లో రాష్ట్ర పునర్విభజన కార్యక్రమాలేవీ చేపట్టాలనే అభిప్రాయం మాకులేదు. అథవా చేపడితే అది సౌమనస్యాలకూ సత్ప్రయోజనాలకూ దారితీసేదిగా వుండాలి.

## నెహ్రూ రేడియో ప్రసంగం

న్యూఢిల్లీ, డిసెంబర్ 5: డిసెంబర్ 7 తేదీ రాత్రి 8-30 గం ప్రధాని జవహర్ లాల్ నెహ్రూ ఒక రేడియో ప్రసంగంచేస్తారు.

## భారతరాజ్యాంగ పరిషత్ భవనం నుండి కంచుకిరీటం తొలగింపు

### రిపబ్లిక్ ప్రకటనకు ఢిల్లీలో సన్నాహాలు: బ్రిటిష్ రాజరిక లాంఛనాలకు స్వస్తి

న్యూఢిల్లీ, డిసెంబరు 6: 500 పౌండ్ల బరువుగల రాజాగారి కంచు కిరీటమును, పి. డబ్ల్యు. డి పనివాండ్లు నాల్గురోజులు శ్రమించి రాజ్యాంగ పరిషత్ భవన గోపురమునుండి క్రిందికి దించివేసిన దానిని భారత పార్లమెంటు సభ్యులు సభకు వెళ్లుచు వీక్షించిరి.

జనవరి 26 తేదీన భారతదేశము రిపబ్లిక్ కానుండుటచే యింతవరకు బ్రిటిష్ రాజరికమునకు చిహ్నముగా నున్న ఈ కిరీటమును దింపివేసిరి. ఈ కిరీట మాక్రమించుచుండిన స్థానమును అశోకుని సింహములాక్రమించునని అనుకొనుచున్నారు. బ్రిటిష్ సామ్రాజ్య నిర్మాతల విగ్రహములను తొలగించు విషయమై ప్రభుత్వమువారింకను నిర్ణయము గావించలేదు. ఐనప్పటికి ఉత్తరోత్తరా అవి చిత్రవస్తు ప్రదర్శనశాలలకు చేరునని తలపవచ్చును.

## బ్రిటన్‌లో భారత రిపబ్లికన్ పౌరహక్కుల రక్షణబిల్లు

### ద్వితీయ ప్రతిపాదన ఆమోదం

లండన్, డిసెంబరు 5: ఇండియా రిపబ్లిక్ కావడంవల్ల వచ్చే మార్పులకు సంబంధించిన చట్టానికి నేడు కామన్సు సభలో రెండవ ప్రతిపాదన జరిగింది. ఈ ద్వితీయ ప్రతిపాదన ప్రతిఘటన ఏమీ లేకుండానే జరిగిపోయింది.

ఇండియా రేపు వచ్చే జనవరి 26 వ తేదిని రిపబ్లిక్ అవుతుంది. అయినా ఈ బిల్లువల్ల ఇండియాకు ఇంతకు పూర్వం కామన్వెల్తులో ఉన్న హక్కులన్నీ యథాతథంగానే ఉంటాయి.

కామన్వెల్తు సంబంధాల కార్యదర్శి ఫిలిప్ నోయల్ బేకర్ కామన్సులో ఈ బిల్లును రెండవసారి ప్రతిపాదిస్తూ ఇలాగ చెప్పారు. "బ్రిటిషు డొమినియనులు క్రమ క్రమంగా తమ వ్యవహారాలు తామే నిర్వహించుకుంటూ అంతర్జాతీయ వ్యవహారాలలో ప్రాముఖ్యం సంపాదించాయి. 1926 లో బాల్ఫరు ప్రకటన వెలువడేసరికి రాజ్యాంగరీత్యా ఒక పెద్దమార్పు జరిగినట్లయింది. బాల్ఫరు ప్రకటనలో అంతవరకు వచ్చిన మార్పులను అంగీకరించడమే జరిగింది. అయితే ఇండియాకు వచ్చే ప్రతిపత్తి విషయంలో భారతీయులకు, విదేశీయులకుకూడా కొన్ని అనుమానాలు ఏర్పడ్డాయి. అయితే అప్పుడు నేను ఇండియాకు త్వరలోనే తప్పకుండా స్వాతంత్ర్య ప్రతిపత్తి రాగలదని అన్నాను. నేటితో ఇండియాకు సంపూర్ణమైన జాతీయతా ప్రతిపత్తి ఏర్పడింది. నేడు భారతదేశం ప్రపంచంలో సర్వ స్వతంత్ర ప్రతిపత్తితో వ్యవహరిస్తున్నది. డొమినియనులు సర్వ స్వతంత్ర ప్రతిపత్తి సంపాదించడమనేది గత నూరు సంవత్సరాలలోను జరిగిన ఒక గొప్ప సంఘటన. డొమినియను దేశాలలోని ఈ జాతీయత క్రమక్రమంగా వాటి స్వతంత్ర ప్రతిపత్తి వల్ల సంపూర్ణమైనది. 1931 లో ఆమోదించిన వెస్టు మినిస్టరు చట్టం వల్ల ఈ దేశాలన్నిటికీ తమ స్వతంత్ర రాజ్యాంగంనిర్మించుకోవడంలో సంపూర్ణమైన అధికారం ఏర్పడింది.

ఈ అధికారం వల్ల భారత నాయకులందరు 1950 జనవరి 26 వ తేదీ నాటికి ఇండియా రిపబ్లిక్ కావాలనీ, దానికొక అధ్యక్షు డుండాలనీ తీర్మానించుకున్నారు. అంతే కాక పండిత నెహ్రూ తన సహచరులతో సంప్రతించి ఇండియాకు కామన్వెల్తులో సభ్యత్వం ఉండాలని కూడా నిశ్చయించారు. ఈ రెండు నిర్ణయాల వల్ల కామన్వెల్తులోని మిగిలిన దేశాలన్నిటికీ రిపబ్లికుకు, కామన్వెల్తులో సభ్యత్వానికీ ఉన్నదా? అని సందేహం కలిగింది. ఈ సమస్య మనకొక్కరికే గాక, కామన్వెల్తు లోని దేశాలన్నిటికీ కూడా సంబంధించిన ప్రశ్నగా పరిణమించింది.

నోయల్ బేకర్ ఈ విషయంలో ఇంకా మాట్లాడుతూ గత ఏప్రిలులో ఈ విషయంలో కామన్వెల్తు దేశాల ప్రధాన మంత్రులసభ జరిగినదనీ, అందులో ఇష్టం వచ్చినట్లు స్వీయ రాజ్యాంగాన్ని నిర్మించుకోడానికి ఇండియాకు హక్కున్నదని గుర్తింపబడినదనీ చెప్పారు. ఈ విషయంలో ఆయన ఇంకా ఇలాగ అన్నారు. "గత ఏప్రిలులో జరిగిన సమావేశంలో రాజ్యంగా లెప్పుడూ నిర్ణీత రాజ్యాంగ చట్టాలవల్ల పెరిగే అవకాశం లేదనీ, క్రమంగా ఆచారాలవల్లనే అవి పెరగాలనీ, అందుచేత ఆంగ్లరాజరికం ఉన్నంతమాత్రాన్ని ఇండియా రిపబ్లిక్ కామన్వెల్తులో భాగస్వామిగా ఉండడానికి అభ్యంతరం లేదనీ నిర్ణయించారు. అందుచేత ఆ సమావేశంలో ఉన్నవారందరు ఇండియా కామన్వెల్తులో సంపూర్ణ భాగస్వామిగా ఉండాలనీ, ఈ కామన్వెల్తు సభ్యత్వానికి రాజు అధికారం ఒక చిహ్నం వంటిదనీ ప్రకటించారు"

నోయల్ బేకరు ఇంకా ఇలాగ అన్నారు. "ఈ ప్రకటనవల్ల ఇండియాకు కామన్వెల్తుకు ఉన్న సంబంధాలు దృఢతరం అవుతాయనికూడా తేలింది. ఇంతే కాదు, ఈ ప్రకటనవల్ల మనకూ భారత దేశానికి గలమైత్రి అభివృద్ధి చెందగలదనీ, మన సహాయం భారతదేశం స్వీకరించగలదనీ నా అభిప్రాయము. ఇంకా ఈ ప్రకటనవల్ల భారతీయులు ఇంతకుపూర్వం కామన్వెల్తు దేశాలలో అనుభవిస్తున్న పౌరస్వత్వాలన్నీ ఇప్పుడుకూడా అల్లాగే అనుభవించడానికి సంపూర్ణమైన అర్హత ఉన్నది."

ఆపైని ఈ చట్టంలోని సూత్రాలను గురించి వీటివల్ల వచ్చే పరిణామాలను గూర్చి మాట్లాడుతూ నోయల్ బేకర్ ఇల్లాగ చెప్పారు. "ఈ చట్టంలోని మొదటిసూత్రం ప్రకారం ఇండియా రిపబ్లిక్ అయినా, భారతీయులకు, వారి ఆస్తికి ఇంగ్లండు న్యాయసూత్రాలు వర్తిస్తాయి. దీనివల్ల భారతీయులకు ఈ దేశంలో ఇంతకు పూర్వంనించీఉన్న హక్కులు మారకుండా అల్లాగే ఉండిపోతాయి. ఇండియాకు మనకు ఇంతకుపూర్వంనించీ ఉన్న ప్రత్యేక వాణిజ్యావకాశాలు, హక్కులు అల్లాగే ఉండిపోతాయి. ఇదిచుమించుగా ఇండియాకు సంబంధించిన మన చట్టాలన్నీ అల్లాగే ఉండిపోతాయి. అల్లాగే వలస దేశాలలో ఉన్న భారతీయులకు సంబంధించిన సూత్రాలుకూడా యథాతథంగానే వర్తిస్తాయి. కాని వలసలలో అధికారంలో ఉన్నవారు వీటివిషయంలోమార్పులు చెయ్యవచ్చును."

ఆపిమ్మట ప్రతిపక్షం తరపువరి చార్లు బల్లురు మాట్లాడుతూ ఈ చట్టంతో తమ పక్షం సంపూర్ణంగా ఏకీ భవిస్తున్నదనీ, గత ఏప్రెలులో తీసుకున్న నిర్ణయాల వల్లనే ఈ చట్టం ప్రతిపాదింప బడుతున్న దనీ అన్నారు.

## కొత్త మదరాసు షరీఫ్

### శ్రీ ఆర్. రామనాదం చెట్టియార్ నియామకం

మదరాసు, డిసెంబర్ 6:-నేడుమంత్రి వర్గము మాన్యశ్రీ మదరాసు గవర్నరు భవనగర్ మహారాజాగారి అధ్యక్షతను సమావేశమై శ్రీ ఆర్. రామనాథంచెట్టియార్ గారని మదరాసు షరీఫ్‌గా నియమించిరి.

శ్రీ రామనాథం చెట్టియార్ వయస్సు 86 సం॥ లు. కళాశాల విద్యాభ్యాసము ముగిసిన తరువాత పరిశ్ర వాణిజ్య విద్య నిమిత్తం విదేశములకు వెళ్ళి ప్రపంచ యాత్ర చేసిరి. డిప్యూటీ షరీఫ్ గను రిజర్వు బ్యాంకు స్థానిక బోర్డు సభ్యుడుగను కొంతకాలము రిజర్వుబ్యాంకు కేంద్ర బోర్డు సభ్యుడుగను పనిచేసిరి. ప్రస్తుతము సౌత్ ఇండియా వాణిజ్యమండలి తరపున కార్పరేషను సభ్యుడుగ వుండిరి.

## తూర్పు పాకిస్తాన్ మంత్రి రాజీనామా

(1-వ పేజీ తరువాయి)

కంరేటును తగ్గించడానికి నిరాకరిస్తు చేసిన నిర్ణయం విషయంలో ఇటీకీ పాకిస్థాన్ ప్రభుత్వానికీ విభేదాలు వచ్చినట్లు తెలుస్తున్నది.

### బొంబై వర్గాల అభిప్రాయం

బొంబాయి, డిసెంబరు 5: తూర్పు బెంగాలు ఆర్థిక మంత్రి రాజీనామా తూర్పు బెంగాలు జనపనార వర్తకంలో ఏర్పడిన ప్రతిష్టంభనవల్ల ఏర్పడినదని బొంబాయి పి. టి. ఎ. విలేఖరి వ్రాస్తున్నాడు.

ఈ ఆర్థిక మంత్రిని తూర్పు బెంగాలు మంత్రివర్గంలోని మరి ఇద్దరు మంత్రులు సమర్థిస్తున్నారనీ, వారి రాజీనామాలు కూడా త్వరలోనే పైకి రాగలవనీ ఇక్కడ గట్టి వదంతులు బయలుదేరాయి.

పాకిస్థాన్ రూపాయి మారకం తగ్గించక పోవడంవల్ల తూర్పు బెంగాలు జనపనార వ్యాపారానికి గట్టి దెబ్బ తగిలిందనీ, అందుచేత పాకిస్థాన్ రూపాయి మారకం విలువ తగ్గించాలనీ, ఆర్థికమంత్రి చౌదరీ ఆయన సహచరులు పట్టుపట్టారట.

అల్లాగే తూర్పు బెంగాలులో బియ్యం ధర పడిపోవడంవల్ల కూడా ఈ చౌదరీవర్గం చాలా కంగారుపడుతున్నారట. చౌదరీ వర్గం తూర్పు బెంగాలుకు స్వతంత్రమైన ఆర్థిక ప్రతిపత్తికూడా ఉండాలని పట్టు పట్టుతున్నదట.

చౌదరీ రాజీనామావల్ల పాకిస్థాన్ రేపు ప్పుడైనా రూపాయి మారకం తగ్గించవచ్చునని ఇక్కడ అనుకుంటున్నారు.

ఈ లోగా తూర్పు పాకిస్థాన్ జనపనార వ్యాపారం ఇంకా మందగించిపోతున్నదని తెలుస్తున్నది.

## ఆంధ్రరాష్ట్ర నిర్మాణం: మంత్రివర్గ చర్చ

(1-వ పేజీ తరువాయి)

నియమేము కేంద్ర ప్రభుత్వమునకు వ్రాయుచున్నాను.

ప్ర:— ఈ సంగతిని కేంద్రప్రభుత్వమునకు ఎప్పుడు తెలిపెదరు?

స:—రేపు కమిటీ నిర్ణయమైన తర్వాత తెలిపెదము. తంతిద్వారా తెలుపవలసిన తొందరలేదు. విమాన టపాలో పంపెదము. కేంద్ర ప్రభుత్వంవారు తెలిపిన ఇతర అంశములను రేపు నియమింపబోవు కమిటీవారు తీర్మానించెదరు.

ప్ర:—ఏప్రెల్ 1 లోపున రాష్ట్రం రావలసివస్తే బడ్జెటు సమావేశం అడ్డు వచ్చుటలేదా?

స:-కేంద్రప్రభుత్వం తేదలచుకుంటే ఒకరోజు దొరక్కపోదు.

ప్ర:-ఈ ఏడాది మనబడ్జెటుమాటఏమి?

స:-రాష్ట్రం యీపు ఏర్పడేవరకూ ఏమీ జరగనటులే మామూలుగనే బడ్జెటు ఏర్పాటు జరుగుతుంది. రాష్ట్రంవస్తే తర్వాత బడ్జెటు వేరు చేసుకోవచ్చు. ఏప్రిల్ ఒకటో తేదీకి ఆంధ్రరాష్ట్రాన్ని తెచ్చే బిల్లు ఆమోదించటానికి శాసనసభకు వీలుగాకపోవచ్చు. మరో పదిహేను రోజులు ఆలస్యంగానవచ్చు ఈ లోపున బడ్జెటు విడదీసే విషయంరాదు.

ప్ర:-మీరు నియమించే కమిటీవారు ఫలాని తేదీలోగా పని ముగించాలనిమీరు కాలవ్యవధి నిర్ణయించినారా?

స:-లేదు, గడువు నిర్ణయించలేదు. కమిటీవారు కూర్చొని ఆలోచించి ఎప్పుడు పనిముగించవచ్చో తేల్చగలరు."

## విద్యాశాఖవ్యయం తగ్గింపు

(1-వ పేజీ తరువాయి)

తాను అంగీకరింపవలసి వచ్చెననిరి. "హఠాత్తుగా ఈ తుపాను మాపైబడినది"అని విద్యాశాఖ కార్యదర్శి చెప్పెను.

బడ్జెటులో 1949-50 సం॥ మునకు వయోజన విద్యకు ఒక కోటి, ప్రాథమిక విద్యా కార్యక్రమమునకు 50 లక్షలు ప్రత్యేకింపబడెనని ఆయన చెప్పుచు ఈ కోటి 50 లక్షలలో విద్యాశాఖవారు 76 లక్షలు వదలుకొనవలసి వచ్చెనని మౌలానా అజాద్ గారనిరి. సాంకేతిక విద్యకు ప్రత్యేకింపబడిన 175 లక్షలలో 52 లక్షలు వదలుకొనవలసి వచ్చెననిరి. గ్రాంటు తగ్గింపబడినను ప్రాచ్య ఉన్నత సాంకేతిక కళాశాల స్థాపనకై సన్నాహములు సాగుచున్నవనిరి. రాబోవు ఆర్థిక సంవత్సర ప్రారంభమున ఈసంస్థ పనిచేయ నారంభించునని మౌలానాగారు రాసించిరి. ఇట్టులే బొంబాయి దగ్గర మరియొక సాంకేతిక కళాశాల స్థాపనమునకు సన్నాహములు జరుగుచున్నవనిరి.

## రూ 62,000 దొంగతనం

తేనంపేటలో కాల్టెక్సు ఏజెంటు కింబలీ గారి బంగళాలో సోమవారం రాత్రి దొంగలుపడి రూ 62,000 సొత్తు దొంగిలించిరి.

## రాజంపేట పంటల సహకార సంఘాధికారుల కేసు

### హైకోర్టులో ముద్దాయిలకు చెరి రూ. 100 జరిమానా

చెన్నపట్నం, డిశంబరు 6: రాజంపేటలో పంటలకు ఋణాలిచ్చే సహకార సంఘ కార్యదర్శి శ్రీ వి. ఆర్. సత్యనారాయణ అధ్యక్షుడు శ్రీ బి. వెంకటసుబ్బయ్య డైరెక్టరులు శ్రీ పి. వెంకటస్వామి శ్రీ పి. వీరారెడ్డి అనువారు 1944-45 సంవత్సరములలో జిల్లా సెంట్రల్ సహకార బ్యాంకి నుండి అపుడపుడు డబ్బుతీసికొని పంటలకు ఋణాలిచ్చే తమ సహకార బ్యాంకి మూలముగా అట్టి ఋణాలు గైకొనుటకు అర్హులు కానట్టి వర్తకులకు తదితరులకు సరయైన తనఖాలేకుండా సుమారు 104 మందికి దాదాపు రు 3 లక్షలవరకు డబ్బు నిచ్చుటకు కుట్రచేసి మోసం నేరము గావించిరని పెనుక కడప స్పెషల్ ఫస్టు క్లాస్ మేజస్ట్రేటు వారికి పైరెండు నేరాలకు కలిపి ఏకంతంమీద చెరి ఒకసంవత్సరము శిక్షవిధించి యుండెను. పైవారికి ఈ నేరమునందు తోడ్పడిన సహకారసంఘం గిడ్డంగి గుమాస్తాకుకూడా యీ శిక్షయే విధింపబడెను. తరువాత ముద్దాయిలు జిల్లా సెషన్సుకోర్టులో అపీలు చేయగా మొదటి 6 గురిని జిల్లాజడ్జి నిరపరాధులని వదిలివేసి గిడ్డంగి గుమాస్తాకు మాత్రం శిక్షను ఖాయపరచెను.

ప్రభుత్వము సెషన్సుజడ్జి తీర్పుమీద హైకోర్టులో అపీలుచేయగా న్యా॥ ఏ యస్. పి. అయ్యర్ గారు శ్రీ వి. ఆర్. సత్యనారాయణకు తప్ప 4 గురికి, చెరి రూ 100 జరిమానా విధించిరి ఈ వ్యవహారములో సహకారబ్యాంకి నష్టపు లేక పోయినందున ముద్దాయిలు యిదివరకు అనుభవించిన శిక్షతోపాటు యీ వంద రూపాయలు జరిమానా చాలునని న్యాయమూర్తి అభిప్రాయము తెలిపెను గిడ్డంగి గుమాస్తా శిక్షమాత్రం ఖాయపరచబడెను

## జాలార్పేట వద్ద రైలు ప్రమాదం

మదరాసు, డిశంబరు 6 నిన్న రాత్రి కొచిను ఎక్సుప్రెసులో నీలగిరి ఎక్సుప్రెసులో బయలుదేరి వెళ్లిన ప్రయాణీకులం, నేడుదయం తిరిగి ఆ బండ్లలోనే మదరాసు వచ్చిరి వారిని ఎగ్మూరు తిరుచునాపలి మీదుగా దక్షిణాదికి పంపే యేర్పాటులు జరుగుచున్నవి జాలార్పేటకు అవతల దొడ్డం పట్టి దాసం పట్టి అను రెండు స్టేషనుల మధ్య (సేలంకి 50 మైళ్ల దూరంలో) ఒక గుడ్సు బండి యొక్క 16 పెట్టెలు పట్టాలు తప్ప పడినవి కారణం తెలియదు. రైలు మార్గానికి నిరోధం కలిగింది. అవతల బండ్లు ఈరోడు వద్ద మదరాసు నుండి వచ్చే బండ్లు జాలార్పేట వద్ద నిలచిపోయినవి

## నాయకులతో కళావెంకట్రావుగారి చర్చలు

1 వ పేజీ తరువాయి

జనవరి 26 నకు లెఖ్ఖలు తయారు చేయుట పూర్తికాదనీ, ప్రత్యేక ఏర్పాటులు ఏమైనా చేసిన వీలంతేమా ఏప్రిల్ 1 కైతే వీలుగా చేయవచ్చుననీ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి అభిప్రాయ పడినటుల తెలియుచున్నది

### నాయకులతో సంప్రదింపులు

అఖిలభారత కాంగ్రెసుసంఘ కార్యదర్శి కళా వెంకట్రావు గారిని నిన్న వచ్చిన వెంటనే ఆంధ్రమంత్రులు నీలం సంజీవ రెడ్డి, కల్లూరి చంద్రమౌళిగారలు దర్శించిరి. ఒక గంటసేపు సంప్రదింపులు జరిపిరి. శ్రీ వెంకట్రావు గారు అనంతరం శ్రీ ప్రకాశంపంతులుగారిని దర్శించి ఆంధ్ర రాష్ట్ర నిర్మాణ సందర్భమున సంప్రదింపులు జరిపిరి. నేట ఉదయం తమిళ కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ కామరాజ నాడార్, మద్రాసు ప్రధాని కుమారస్వామిరాజా, మంత్రి భక్తవత్సలంగారితో సంప్రదించి తమిళ నాయకుల అభిప్రాయములను తెలుసుకొనిరి. అనంతరము మరల ఆంధ్ర మంత్రులతో సంప్రదించిరి. నేట ఉదయం మరల శ్రీ ప్రకాశం పంతులు గారిని దర్శించిరి.

నేడు సమావేశమగు మంత్రి వర్గము వారు కమిటీ సభ్యులను గూర్చి చర్చించి కమిటీ నిర్ణయమును రేపు చేసెదరని తెలియుచున్నది. శ్రీ ప్రకాశం పంతులు, కళా వెంకట్రావు, బెజవాడ గోపాల రెడ్డి నీలం సంజీవ రెడ్డిగారలు తెనుగ సభ్యులుగను శ్రీ కామరాజ నాడార్, భక్తవత్సలం, మాధవ మీనన్, కుమారస్వామి రాజా గారలు మిగత సభ్యులుగ లుండగలరనియు, అవసరమైతే ఎన్. రంగా రెడ్డి, టి. టి. కృష్ణమాచారి గారలు గూడా ఉండగలరనియు అభిజ్ఞ వర్గాల వారు తెలుపుచున్నారు.

# ఇండియాలో తంతి ఫాక్టరీ నిర్మాణం

## టెలిఫోను కేబిల్ కంపెనీతో ఇండియా ప్రభుత్వంవారి ఒప్పందం

[ఆంధ్రపత్రిక విలేఖరి]

న్యూఢిల్లీ, డిసెంబరు 4: ఇండియాలో తంతిఫాక్టరీ నిర్మించేనిమిత్తమై ఇండియా ప్రభుత్వంవారు గ్రేట్‌బ్రిటనులోని టెలిఫోను కేబిలుకంపెనీవారితో ఒక ఒప్పందం చేసుకున్నారు. ఈ ఒప్పందం అన్నిరకాల సమాచారతంతులకూ, ఇతర పరికరాలకూ, సన్నని ఇనామెలుతీగెలకూ వర్తిస్తుంది. ఒప్పందం అనుసరించి పైకంపెనీవారు టెక్నికలు సలహాదార్లచేత ఫాక్టరీ ప్లానులు వగైరాలు తయారుచేయిస్తున్నారు. ఫాక్టరీకి సంబంధించిన అన్ని సలహాలూ కంపెనీవారే చెబుతారుగాని ఫాక్టరీ నిర్మాణపదార్థాలకు వారిజవాబుదారీ ఉండదు. ఫాక్టరీకి కావలసిన ఇంజనీర్లనూ, టెక్నిషియనులనూ కంపెనీవారే సప్లయి చేసి భారతీయులకు ఫాక్టరీ నడిపే పద్ధతులలో శిక్షణ ఇస్తారు. ఇండియా ప్రభుత్వానికి కంపెనీవారు ఉత్పత్తియంత్రాలుకొని పెడతారు; మరొకరికి ఇవ్వని షరతుమీద ప్రస్తుతం ఉన్న పేటెంట్లుకూడా ఇండియా ప్రభుత్వానికి ఇస్తారు.

ఇండియాకు కావలసినంత తంతి ఈఫాక్టరీలో తయారయేవరకు, ఇండియా అవసరాలలో సగం వంతు ఈకంపెనీ వారే, బ్రిటిషు పోస్టాఫీసులకు సప్లయి చేసే ధరమీద నూటికి రెండున్నర వంతులు వేసి సప్లయిచేయగలరు. మిగిలిన సగం వంతులు కంట్రాక్టు పద్ధతిమీద సప్లయిచేయగలరు. కావలిస్తే కంపెనీవారు ఫాక్టరీకి కావలసిన ముడిపదార్థాలూ, ఉపకరణాలూ కొనడానికి ఏజంట్లుగా ఉండగలరు. దానికిగాను వారికి తణిఖీ చార్జీ నూటికి 2 న్నర వంతులివ్వాలి. ఒప్పందం అమలులో ఉండేకాలంలో భారత ప్రభుత్వం గాని, ఫాక్టరీగాని ఫాక్టరీ తయారుచేసే వస్తువులను ఇతర కంపెనీలనుంచి కొనరాదు. ఫాక్టరీ నిర్మాణానికి అయే ఖర్చులో నూటికి 6 వంతులు కంపెనీకి ఇవ్వాలి. ఈ మొత్తం ఇంతకు మించరాదని నిర్ణయించవచ్చు. ఏడాదికి 5 కోల పౌనులకు తగ్గకుండా తయారు వస్తువుల ధరమీద నూటికి రెండువంతులు కూడా కంపెనీకి ఇవ్వాలి. చెల్లింపులు స్టెర్లింగులో జరగాలి. ఒడంబడికలో బర్మా, సింహళం, నేపాలు ప్రాంతాలకు జరిగే ఎగుమతులు కూడా చేర్చబడినవి.

## ప్రభుత్వ వాణిజ్యం

అసోసియేటెడ్ చేంబర్స్ ఆఫ్ కామర్స్ సంస్థవారు (ఈ దేశంలోని బ్రిటిషు వ్యాపారస్థుల ప్రతినిధి సంస్థ) ప్రభుత్వ వాణిజ్య సంఘంవారికి ఒక నివేదిక పంపుతూ ప్రభుత్వ వాణిజ్య విధానానికి పూర్తిగా వ్యతిరేకించారు. ఇండియా విదేశ వాణిజ్యం ప్రపంచవాణిజ్యంలో ఒక అంశమనీ, దానిని తారుమారు చేయరాదనీ వారు చెప్పారు. ఇంతముఖ్య విషయం గురించి ఈ తరుణంలో విచారణ ప్రారంభంకావడం వాంఛనీయం కాదని వారన్నారు. "విదేశీవ్యాపారంలో ఇండియా ప్రభుత్వం కాలుపెట్ట జూస్తున్నదని తెలిసినంతమాత్రం చేతనే ఇండియా ఆర్థిక వ్యవస్థనూ, పై దేశాలతో గల వాణిజ్యసంబంధాలకూ నష్టంకలగవచ్చు," అని చెబుతూ ఆహారధాన్యాలు, యుద్ధసామగ్రి విషయంలోతప్ప ప్రభుత్వవాణిజ్య విధానం అమలు జరగరాదని సూచించారు.

## 1950 ఆహార దిగుమతులు

న్యూఢిల్లీ, డిసెంబర్ 5: అర్జెంటినా నుంచి దిగుమతి అయే 8,90,000 టన్నుల గోధుమ మినహా 1950 సం॥లో ఆహార దిగుమతులకు ఏ విధమైన ఆర్డర్లూ ఇవ్వలేదని కేంద్ర ఆహారమంత్రి జైరాందాస్ దౌలత్‌రాంగారు నేడు పార్లమెంటులో రాజ్‌కన్వర్ అడిగిన ప్రశ్నకు ఇచ్చిన లిఖిత సమాధానంలో వెల్లడించారు.

"గోధుమ ధర 100 కి 44 వంతులు—అంటే ద్రవ్యమారకపు విలువను తగ్గించిన మేరకు—పెరగవచ్చును. సులభద్రవ్య ప్రాంతాలనుంచి 1949 సెప్టెంబర్ వరకూ 2,18,500 టన్నుల గోధుములు, పిండి, 86,700 టన్నుల బియ్యం దిగుమతి ఐనవి. వాటి విలువ 12 కోట్ల 66 లక్షల రూపాయలు" అని ఆయన వివరించారు.

## జపాన్ యుద్ధనేరస్థుల విచారణ సమాప్తి

టోక్యో, డిసెంబర్ 4: జపాన్‌యుద్ధనేరస్థులపై తాము జరుపుతున్న విచారణలను అమెరికా, బ్రిటన్, చైనా, బర్మాలు ముగించినవని జపాన్ విదేశాంగ కార్యాలయం నేడు ప్రకటించింది.

ఫిలిప్పైన్సు, ఫ్రెంచి ఇండోచైనాలు ఈ నెలాఖరుకు విచారణలు ముగించ

PRIME MINISTER.
INDIA.



New Delhi,
November 30, 1949

FLAG DAY

I commend the Flag Day, which is going to be observed on December 7th, to our people. This day is particularly suited to bring our Defence forces closer to the mass of our people. It is a day when we should think of them and try more especially to help those who have been disabled and those who are watching and protecting the frontiers of our great land. Our youngmen, whether in the Army or the Navy or the Air Force, have faced many a trial in the recent past and have justified themselves and their country. Let us send our goodwill to them and contribute to the funds that are being raised to provide amenities to them and aid to their families and dependents.

Jawaharlal Nehru

# పతాకదినోత్సవం: ప్రజానీకానికి నెహ్రూ సందేశం

ఢిల్లీ, డిసెంబరు 6: డిశంబరు 7వ తేదీ జాతీయ పతాక దిన మహోత్సవాలను పురస్కరించుకుని ప్రధాని నెహ్రూ ఈదిగువ సందేశాన్ని ప్రకటించారు.

ఈ మహోత్సవదినం ప్రజలనూ సైనికశాఖలనూ సన్నిహిత పరచటానికి ఉపకరించాలి. మనదేశంయొక్క సరిహద్దులనన్నిటినీ రక్షిస్తూ మనకోసం అనేక కష్టనష్టాలు ధరించుతున్నవారినిగురించీ, మనకోసం అవయ్యలవుతున్నవారిని గురించీ ఈ నాడు మనం తలపోయాలి. విమాన నావా, సైనిక శాఖలన్నిటిలోనూ వున్న మన యువకులంతా ఇటీవల అనేక కష్టనష్టాల నెదుర్కొని దేశంయొక్క గౌరవాన్నీ తమ గౌరవాన్నీ కూడా నిలబెట్టుకున్నారు! వారికీ, వారి కుటుంబాలకీ సహాయాన్ని అందజేయటానికిగాను యేర్పాటు చేయబడిన పతాకదిన నిధికి విరివిగా విరాళాలిచ్చి ఆ యువకులకు మన సహాయ సౌహార్దములను అందజేయాలి' అని ప్రకటించారు.

పతాకదిన మహోత్సవాలయేర్పాట్లన్నీ పూర్తి అయినవి. జాతీయ పతాకాలను అమ్మటంవల్ల వసూలయ్యే డబ్బుకాక 'పతాక దిననిధి' అనేపేర వేరే నిధి వసూలుచేస్తున్నారు. విరాళాలు పంపదలచినవారు 'పతాకదిన నిధి కేంద్రసంఘం కార్యదర్శి, రక్షణశాఖ, న్యూఢిల్లీ' అనే చిరునామాకు క్రాస్ చెక్కులు పంపవచ్చును.

## జండాదినం: గవర్నరు విన్నపం

మదరాసు గవర్నరు గారు యిట్లు విన్నవించుచున్నారు.

గత యుద్ధంలో యీరాష్ట్రం సుమారు 5 లక్షల మంది స్త్రీ పురుషులను సైనిక సేవకు పంపెను. వారిలో చాల మంది తిరిగి వచ్చిరి కాని ఉద్యోగాలందరికి లభించలేదు. యుద్ధమునందు పాల్గొని మనకు సహాయం చేసినందుకు వారందరికి మనమెంతో ఋణపడియున్నాము. వారచట నేర్చిన క్రమశిక్షణ సేవానిరతి ప్రజలకెంతో యుపయోగ పడగలవు.

దేశం యొక్క భద్రత సైన్యము యొక్క ధైర్య స్థైర్యముల పై ఆధారపడియుండును. మన యువకులా సైన్యమున చేరుటకు ప్రోత్సాహముండుటకై మాజీ సైనికులయెడ మనం శ్రద్ధ వహించాలి. అన్ని కష్ట సమయాలలో తమ కుటుంబాలను ప్రజలు పోషించగలరను ధైర్యం వారికుండాలి కనుక సైనిక సహా

ప్రయత్నిస్తున్నవి. ఆస్ట్రేలియా, హాలెండ్ ప్రభుత్వాలచే ఆలోచించబడినవారి విషయమై ఈ ప్రకటన ఏమీ చెప్పలేదు.

ఇప్పటికి 2784 మంది యుద్ధనేరాలకు శిక్ష విధించబడ్డారు. ఇంకా 194 మంది విషయం తేలవలసి ఉన్నది.

యానికై ఉద్దేశింపబడిన యీ జండా దినమున ప్రజలంతా ద్రవ్యమిచ్చి తోడ్పడవలెను."

## హోము గార్డులు

హోముగార్డుల సంస్థ కొనసాగించుటకు మదరాసు ప్రభుత్వం వారు సాలీనా రూ. 2½ లక్షలు ఖర్చు చేయుచున్నారు. వీరి సంఖ్య తగ్గించుట గూర్చి యిపుడాలోచించుచున్నారని తెలియుచున్నది. ఈ విషయములు కేంద్ర ప్రభుత్వమునకు వ్రాసిరి.

## గవర్నరుగారి ఆంధ్రదేశ సంచారం

మదరాసుగవర్నరు భావనగరు మహారాజాగారు, భార్య యీనెల 10వ తేదీ విశాఖపట్నంలో ఆంధ్ర విశ్వవిద్యాలయం పట్ట ప్రదానోత్సవమునకు హాజరయ్యెదరు. తరువాత 14వ తేదీవరకు పశ్చిమ గోదావరి గుంటూరు జిల్లాలలో సంచారంచేయుదురు. 11వ తే కొవ్వూరు, 12 ఏలూరు, 13, 14 గుంటూరు చూచి తిరిగి విశాఖపట్నంవెళ్ళి విమానంపై 16 తే. మదరాసు వత్తురు.

9 తేదీ విమానంలో విశాఖపట్నంచేరి మధ్యాహ్నం ఆ జిల్లాలో వరదలవల్ల నష్టపడిన ప్రాంతాలు చూతురు. 10 తే. మాలానా అబులుకలాం ఆజాదు లేబొరేటరీను, క్రొత్తవాటికి కింగుజార్జి ఆస్పత్రిలో పునాదులువేసి, సాయంకాలం పట్టప్రదానోత్సవమునకు వెడలెదరు.

కొవ్వూరునుండి రామపాదసాగరం ప్రాజక్టు డాము నిర్మాణస్థలమునకు 11 తే. ఉదయం వెడలెదరు. మధ్యాహ్నం సంస్కృత కళాశాల చూతురు. సింగవల్లి అను కోయగ్రామం త్రోవలో చూతురు.

12 తే. ఉదయం ప. గోదావరి జిల్లాలో తుపానునష్టం చూచెదరు. మధ్యాహ్నము స్థానిక కళాశాల దర్శించెదరు.

13 తేదీన అమరావతి స్తూపములు, లాం కొటేలుఫారము, పొగాకు పరిశోధన శాల, నేవనలు టొబాకో కంపెనీ గుంటూరులో చూచెదరు, 14 తే. మాజీ సైనికుల సహకారసంఘము, శ్రీ కృష్ణాశ్రమండి. ఎస్. ఎస్. ఎ. బోర్డు చూచి, మధ్యాహ్నము తుపానుదెబ్బతిన్న ప్రాంతాలు చూతురు.

విశాఖపట్నం, గుంటూరు, ఏలూరులందు గవర్నరుగారు స్థానిక తుపాను సహాయసంఘముల సభ్యులను పనిచేయుచున్న వారినిమాచి అధికారేతరులనుదర్శించెదరు. రెండుచోట్ల మునిసిపలు సంఘాల సన్మానములను బడెయుదురు.

విశాఖపట్నంలో విశ్వవిద్యాలయము నందు సంపత్పూర్తి మహాజకంపస్థాపన 10వ తే. సా. గవర్నరుసభ జరుపును. స్త్రీల శ్రేయోభిలాష కేంద్ర స్త్రీల గృహపరిశ్రమల సహకారసంఘం దర్శించును.

కొవ్వూరు ఏలూరు గుంటూరులందు ఆమె బాలికా విద్యాలయములు, ఆస్పత్రులు, ప్రసూతి చికిత్సాలయాలు చూచును. సేవా సమాజం, రెడ్డుక్రాసుసంఘలు చూచును. గుంటూరులో ఆమె సెంటు జోసెఫ్ కాన్వెంటు, కస్తూరిబా హరిజన హాస్టలు 13వ తే. మహిళాసమాజము, శారదా నికేతనము 14వ తేదీన దర్శించును.

## టపాకాయ ప్రమాదం: ఇద్దరి మరణం

మదరాసు పెరుమాళు వీధిలో సోమవారం మధ్యాహ్నం టపా కాయలమ్మే దుకాణంలో అగ్నిప్రమాదంవలన ఇద్దరు చనిపోయి, ఒకడు గాయపడెను.

రత్నం(25) అనువాడు రోడ్డుపై టపాకీలు అమ్ముచుండగ, వెంకట సుబ్బయ్య అను కడపజిల్లా వ్యాపారస్థుడు అన్ని కొనదలచి, ఒకటి మచ్చుకి కాల్చుమనెను. రత్నం అతని దుకాణంలోనికి తీసుకపోయి 2క టపాకి ముట్టించెను. అందలి నిప్పురవ్వ ఎగిరి ప్రక్కనున్న బాణసంచాపై పడి పెద్ద పేలుడు ధ్వనితో మంటలంటుకొనెను. రత్నం ఒళ్లు కాలి వెంటనే చనిపోయెను. వెంకటసుబ్బయ్య తప్పించుకబయటపడెను, కాని రోడ్డుపై స్పృహతప్పి పడిపోయెను. జనరలు ఆస్పత్రిలో చేర్చినాక కొద్దిఘంటలకు చనిపోయెను. కన్నయ్య శెట్టి అను కిల్లీ దుకాణవారుడు దూరాన ఉండి చూచుచు, కొంచెం గాయపడెను.

ఫైరు బ్రిగేడు జట్టు మైకేలు ఆర్. వి. రాజుగార్ల నాయకత్వమున వచ్చి 20 నిముషాలలో మంట లార్పిరి. పోలీసు ఉద్యోగులచటికిపోయి దర్యాప్తు చేసిరి.

## ఉచిత వైజ్ఞానిక చలనచిత్ర ప్రదర్శనం

తెనాలి, డిసెంబరు 4 తెనాలి రాయల్ టాకీస్ వారు తెనాలి కేంద్రోపాధ్యాయులకు, ఉపాధ్యాయులకు, బాలబాలికలకు ఈనెల 3వ తేదీన "దక్షిణ ధృవయాత్ర" అను వైజ్ఞానిక చిత్రమును ఉచితముగా ప్రదర్శించిరి. ఉపాధ్యాయులు తమ విద్యార్థులచే నూహింప చేయలేని మంచు యెడారులు, వాల్‌రస్, సీల్, మంచుకొండలు, ద్వీపములు, మంచుశిఖరములు, అచటికి పోవునపుడు కలిగిన సముద్రయానమందలి భయంకర తుపానులు దక్షిణధృవప్రాంతమును పరిశోధించుటకు ఆస్ట్రేలియా ఖండమునకు, సైనిక కాలమున్న హెడ్‌దీవికిపోయి, నివాస మేర్పరచుకొనిన 15 గురు విజ్ఞానవేత్తల దళం, వారి నివాసములు చూపి ధృవప్రాంత జీవితమందలి, వాస్తవికతను, చక్కగా అవగాహన చేసుకొనుటకు తోడ్పడెను. ఇట్టి సదవకాశమును కల్పించినందుకు ఉపాధ్యాయులు, బాలబాలికలు హాలు యజమానులైన ముళ్లపూడి హరిశ్చంద్ర ప్రసాదు గార్కి తమ కృతజ్ఞతను తెలియపర్చిరి.

# మురుసుమిల్లి హత్య కేసు

## 4 గురు కమ్యూనిస్టులకు 4 సం. లు. కఠిన శిక్ష

విజయవాడ, డిసెంబరు 5: మురుసుమిల్లి హత్యకేసులో అడిషనల్ సెషన్సు జడ్జి సి. హెచ్. నారాయణమూర్తిగారు తీర్పు చెప్పుతూ ముద్దాయిలైన 4 గురు కమ్యూనిస్టులకు ఒక్కొక్కరికి 4 సంవత్సరములు చొప్పున కఠినశిక్ష విధించారు. మిగిలిన 6 గురు ముద్దాయిలు విడుదల చేయబడినారు.

## పనపాకం పంచాయతీబోర్డు అధ్యక్షుని ఎన్నిక

తిరుత్తని, డిసెంబరు 4: ఈ తాలూకా పనపాకం పంచాయతీబోర్డు సభ్యుల ప్రథమసమావేశము నిన్న చిత్తూరుజిల్లా పంచాయతీ ఆఫీసరు కె. వరసింహరాజుగారి యాజమాన్యమున జరిగినది. ఆసభలో వి. గోవిందరాఘవులు నాయుడు గారిని పంచాయతీబోర్డు అధ్యక్షులుగను, జి. గోవిందరెడ్డిగారిని ఉపాధ్యక్షులుగను ఏకగ్రీవముగ ఎన్నుకొనిరి. (స్వ. వి.)

# చైనా అధ్యక్షపదవి: చాంగ్ పునస్స్వీకారం

## మాజీ అధ్యక్షుడు జనరల్ 'లీ' అమెరికా ప్రయాణం

హాంకాంగ్, డిసెంబర్ 5: జనరలిస్సిమో చాంగ్ కై షేక్ తిరిగి సేను జాతీయ చైనా రిపబ్లిక్ అధ్యక్ష పదవి నలంకరించాడు. మాజీ అధ్యక్షుడు జనరల్ లీసుంగ్ జెన్ హాంకాంగ్ నుంచి అమెరికాకు బయలుదేరి వెళ్లగా అధ్యక్షాధికారాలను చాంగ్ కై షేక్ తనస్వాధీనం చేసుకున్నారు.

తాత్కాలికంగా జాతీయ చైనాకు రాజధానిగ ఉన్న చెంగ్టూ నుంచి కూడా ప్రభుత్వాధికారులు పలాయన మవుతున్నట్లు వార్తలు వస్తున్నవి.

చెంగ్టూకు వచ్చి, ప్రభుత్వ యంత్రాన్ని చేపట్ట నవలసిందిగా జనరల్ లీని ప్రధాన మంత్రి ఎస్. హీ. షాన్ బ్రతిమాలాడని లీ సమ్మతించకపోతే ప్రధాని పదవికి రాజీనామా యిస్తానని కూడా బెదిరించాడని, చెంగ్టూ నుంచి వచ్చిన వార్తలవల్ల తెలుస్తున్నది.

అధ్యక్షపదవి వహిస్తించుటకు లీ నిరాకరించడం మూలంగా కొమింటాంగ్ కేంద్ర స్థాయీ సంఘం, వారం రోజుల తర్వాత మళ్లీ సమావేశమై, జనరల్ లీసుంగ్ జెన్ అమెరికాలో ఉన్నంతకాలము, మార్షల్ చాంగ్ కై షేక్ అధ్యక్షుడుగా వ్యవహరించాలని తీర్మానించింది. మార్షల్ చియాంగ్, చెంగ్టూలో యింకా మిగిలిఉన్న, చైనా ఉన్నతాధికారులను కలుసుకొన్నాడు. కాని ఆయన త్వరలోనే ఫార్మోసాకు వెళ్ళి, అక్కడనుంచి, ఫార్మోజాకు ప్రయాణమై పోతాడని తెలుస్తున్నది.

కమ్యూనిస్టు సైన్యాలు చుంకింగ్ నుంచి పురోగమించి, చెంగ్టూకు ఆగ్నేయంగా 92 మైళ్ల దూరంలో ఉన్న నెకియాంగోవ్ ను ఆక్రమించడంతో, చెంగ్టూలో మిగిలి ఉన్న చైనా అధికారులు, పడవలగా తరలిపోతున్నారు.

చెంగ్టూపైకి నైరుతి చైనా నుండా మరో కమ్యూనిస్టుదళంగూడా వస్తున్నట్లు తెలుస్తున్నది. ఈ పృథ్వయదళాలు యే ప్రతిఘటన లేకుండా ముందుకు చొచ్చుకొనిపోతున్న ఇంకా మిగిలిఉన్న లక్ష జాతీయ చైనాసైన్యం దక్షిణ క్వాంటంగ్ రాష్ట్రానికి దగ్గర ద్వీపకల్పానికి తరలింపబడినదని, అక్కడినుంచి హైనాన్ ద్వీపానికి ఉపసంహరింపబడునని తెలుస్తున్నది.

## అమెరికాకు లీ ప్రయాణం

జాతీయ చైనా రిపబ్లిక్ మాజీఅధ్యక్షుడు జనరల్ లీ సుంగ్ జెన్, విమానాన్ని అద్దెకుతీసుకొని యిక్కడనుండి నేడుఅమెరికాకు బయలుదేరివెళ్ళాడు. కమ్యూనిస్టులను ప్రతిఘటించుటలో అమెరికా సహాయాన్ని పొందగలననే ఆశతోనే యీయన బయలుదేరి వెళ్ళినట్లు, అభిజ్ఞులంటున్నారు. ఈయనతోపాటు పరివారం 12 మందికూడా ఉన్నారు. తనచికిత్సకై అమెరికా వెడుతున్నానని, యీ చికిత్స అట్టేకాలం పట్టకపోవచ్చునని అన్నాడు. "అమెరికా సహాయం చేయకపోయినా హైనాన్‌దీవి కమ్యూనిస్టు పాదాక్రాంతం గాకుండా, జాతీయ చైనా సేనాని జనరల్ పాయ్‌చుంగ్ కాపాడలేకపోయినా జనరల్ లీ అమెరికానుంచి చైనాకు తిరిగిరాడు?" అని ఆయన పరివారంలో ఒకడు వెల్లడించారు.

# "ఆంధ్రరాష్ట్రకాంగ్రెసు కార్యదర్శి బాధ్యతాయుతంగా ప్రవర్తించాలి"

## కందుల ఓబులరెడ్డిగారి విమర్శకు కళా వెంకట్రావుగారి జవాబు

విజయవాడ, డిసెంబరు 5: అఖిల భారత కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి శ్రీ కళా వెంకట్రావుగారు క్రింది ప్రకటన చేస్తున్నారు.

"ఇటీవల కందుల ఓబులరెడ్డిగారు చేసిన పత్రికా ప్రకటన చాల అనుచితంగా ఉన్నది. కాంగ్రెసు అధ్యక్షునిపై విమర్శ చేసేటప్పుడు ఆయన కనీసం కొంత మర్యాదనైనా చూపి వుండవలసింది. ఒక కాంగ్రెసు వాదిపైగాని, చిన్న కాంగ్రెసు సంఘంపైగాని రాష్ట్ర కాంగ్రెసుసంఘం క్రమశిక్షణ చర్య తీసుకొనే సందర్భంలో కాంగ్రెసు క్రమశిక్షణ నియమాల ప్రకారం ఒక నియమిత విధానాన్ని అనుసరించవలసివుంది. అలాంటప్పుడు కాంగ్రెసు అధ్యక్షునికి అప్పీలు చేసుకోవటం జరిగితే, ఆయన ఆఖరి తీర్పు ఇస్తారు. ఉదాహరణకు, హైకోర్టువారు ఒక కేసుపై ఒక విధంగా తీర్పు యిస్తారు; ఫెడరల్ కోర్టువారు ఆ తీర్పుకు వ్యతిరేకిస్తూ మరో తీర్పు నిస్తారు. అంత మాత్రంలో హైకోర్టువారు ఫెడరల్ కోర్టును విమర్శించటంగాని, స్వార్థబుద్ధితో ప్రవర్తించిందని దూషించటంగాని ఎప్పుడూ జరుగదు.

కనుక తాను చేసిన ప్రతి పనీ సక్రమమైనదిగా పరిగణింపబడుతుందని ఓబులరెడ్డిగారు భావించకూడదు. కాంగ్రెసు అధ్యక్షుని ఇలాంటి విషయాలలో తీర్పునివ్వడానికి, తనకు సక్రమమని తోచిన విధంగా నిర్ణయం చెయ్యడానికి అధికారమున్నదని రెడ్డిగారు విస్మరింపరాదు.

రెడ్డిగారు తమ ప్రకటనలో రెండు కేసులను పేర్కొంటూ నన్నుకూడా అనవసరంగా ఇరికించారు. మొదటగా ఎమ్. వెంకటరాజుగారిని గూర్చి చెబుతూ ఆ కేసును దర్యాప్తు చేసిన ఆర్. ఆర్. దివాకర్ వెంకటరాజుగారు చాలా గొప్ప దప్పిదం చేసినట్లు అభిప్రాయ పడ్డారని అన్నారు. దివాకర్‌గారి దర్యాప్తు నివేదిక అసలు ప్రకటితం కాలేదు. దానిని ఓబులరెడ్డిగారు చదివి వుంటారని కూడా నేననుకోను. మరి ఏ దివ్యదృష్టితో ఆయన దివాకర్ నివేదికను ఊహించారో నేనెరుగను.

గుంటూరు జిల్లా కాంగ్రెసు ఎన్నికల విషయంలో వెంకటరాజుగారిపై క్రమశిక్షణ చర్య తీసుకోబడింది. కాంగ్రెసు అధ్యక్షుడు ఈ కేసును బాగా పరిశీలించి రాజుగారి సమాధానాలు తృప్తికరంగా వున్నవని భావించి, రాష్ట్రకాంగ్రెసువారి చర్యను రద్దు చేసి వేశారు. అయిపోయిన వివాదాన్ని రెడ్డిగారు మరలమరల త్రవ్వుతూ వుంటే న్యాయచట్టరీత్యా వ్యవహారం నడపవలసి వస్తుంది.

రెడ్డిగారు కాంగ్రెసు వాదులకు మర్యాద, బహిరంగ ప్రవర్తన విషయాలలో మార్గదర్శకులు కావలసివుంది. ఆయన ఒకవైపు అఖిలభారత కాంగ్రెసు వ్యతిరేకించదలచుకుంటూ, మరోవైపు తమ క్రింది జిల్లా కాంగ్రెసు సంఘాలన్నీ తమకు అనుకూలంగా ఉండాలని కోరటం హేతుయుక్తముగా లేదు.

రెడ్డిగారు, పశ్చిమ గోదావరి కాంగ్రెసు వ్యవహారాలను గూర్చి కూడా అభిప్రాయం వెలిబుచ్చారు. ఈ విషయం ఇంకా విచారణలో ఉండగా ఆయన దీనిని ప్రస్తావన చెయ్యటం అయుక్తం, బాధ్యతారహితం కూడాను. ఆయన ప్రకటనాంశములను ఖండించటానికి నేను సిద్ధంగావున్నాను. కాని నన్ను నేను తమాయించుకుని, బాధ్యతాయుతంగా ప్రవర్తించ గోరుతున్నాను. కాని ఒకటి స్పష్టంచేస్తాను. రెడ్డిగారునన్ను ఢిల్లీలోను, తరువాత విజయవాడలోను కలుసుకున్న మాట నిజమే. కాని పశ్చిమ గోదావరి వ్యవహారంలో నేనాయనకు ఎట్టిసూచన, హామీ ఇవ్వలేదు. ఏ. ఐ. సి. సి. వారికి ఈ కేసు వివరసహితంగా నివేదింపబడకముందే దానిపై తీర్పుఇవ్వగలిగిన శక్తి నాకులేదు; అసలు నేను సలహాయిచ్చినప్పటికీ తప్పుగా వుండేది. నవంబరు 11న ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసువారు చేసిన తీర్మానంలో పశ్చిమ గోదావరిజిల్లా కాంగ్రెసు అధ్యక్షుడు, కార్యదర్శుల ప్రసక్తిలేదు. ఈ విషయమైనన్ను మాట్లాడమని కోరగా, నేనల్లా ముందుగా నాతీర్పు చెప్పనని మాట్లాడ నిరాకరించాను.

నా బహిరంగ జీవితంలో నేనెప్పుడూ క్రమశిక్షణనే అనుసరించాను; వీలైనప్పుడల్లా క్రమశిక్షణ నితరులుకూడా అవలంబించేట్లు చేశాను. కాంగ్రెసులో నాకున్న దీర్ఘానుభవాన్ని పురస్కరించుకుని నేను రెడ్డిగారికి ఒక సలహా యిస్తున్నాను. ఆయన ఇలాంటి విషయాలను వ్యక్తిగత దృష్టితో చూడరాదు. తన నిర్ణయానికి వ్యతిరేకించేదల్లా తప్పేనని, ద్వేషజనితమని, అన్యాయమని, ఆయన భావించరాదు. అన్నిటికంటె ముఖ్యంగా ఆయన కొంత తమాయించుకుని, తేలిపోని వివాదాలపై పత్రికలలో ప్రకటనలు చేయటం మానాలి"

# తిరుత్తని బోర్డు హైస్కూలుకువిరాళం

## ధర్మాదాయ బోర్డు అధ్యక్షుని నిరాకరణ

తిరుత్తని, డిసెంబరు 2: స్థానిక శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామిదేవాలయ ద్రవ్యనిధినుండి స్థానికబోర్డు హైస్కూలు విస్తరణకుగాను 65 వేల రూ. విరాళమిచ్చుటకు దేవాలయ సలహా సంఘంవారు తీర్మానించియున్నారు. మద్రాసు ధర్మాదాయబోర్డు అధ్యక్షులు యీ తీర్మానమును విమర్శిస్తూ, దేవాలయ ద్రవ్యనిధినుండి యీ విస్తమైన విరాళ మివ్వరాదని తీర్మానాన్ని నిరాకరిస్తూ ఉత్తరువుల పంపినట్లు తెలుస్తున్నది. (స్వ. వి.)

# చంద్రాయికోడు ఆక్విడక్ట్: ఉప్పుటేరు వంతెన

## డిసెంబరు 26న భక్తవత్సలంగారిచే శంకుస్థాపన

విజయవాడ, డిశంబరు 6: పోలవరం వద్ద చంద్రాయికోడు ఆక్విడక్టుకు, ఉప్పుటేరువంతెనకు, మద్రాసు పబ్లిక్ వర్క్సు మంత్రి భక్తవత్సలంగారు డిశంబర్ 26 నాడు శంకుస్థాపన చేయుదురు.

## అలమూరువద్ద గోదావరి వంతెన

తూర్పు గోదావరిజిల్లా అలమూరువద్ద గోదావరి వంతెనకు భారత కాంగ్రెస్ కార్యదర్శి కళా వెంకటరావుగారు డిశంబర్ 14 నాడు శంకుస్థాపన చేయుదురని తెలియుచున్నది. ఈ ఉత్సవానికి భక్తవత్సలంగారుకూడా హాజరగుదురు.

(స్వ. వి.)

## శ్రీ షణ్ముఖ జయంత్యుత్సవములు

చీరాల, డిశంబరు 3: స్థానిక భక్తబృంద సహాయముతో స్వర్ణ దక్షిణామూర్తిగారి నోరల ఈపూరి శివాలయములో గతవారం రోజులనుండి షణ్ముఖ జయంతి ఉత్సవాలు నిన్నటివరకు జరిపిరి. నిత్యము పూజలు, సహస్ర నామార్చనలు జరిపిరి. సుప్రసిద్ధ భాగవతారులు విడుదల వెంకయ్య, చింతలపాటి వీరరాఘవయ్య శాస్త్రి, కప్పం కోటయ్యగార్లు హరికథా కాలక్షేపములు గావించిరి.

విడుదల వెంకయ్యగారి హరికథా కాలక్షేపమునకు మహాసభవారు చాలా ఆనందించి వారికి "హరికథా కేసరి" అను బిరుదమును ప్రసాదించి గౌరవించిరి.

# ఫార్మోసా పోవుటకు కొమింటాంగ్ సన్నాహాలు

## అమెరికా సహాయానికి లీసంగ్ అభ్యర్థన?

హాంకాంగ్, డిసెంబర్ 4: కొమింటాంగ్ ప్రభుత్వ సభ్యులను కొందరినీ, వారికుటుంబాలనూ చెంగ్టూనుండి ఫార్మోసాకు తీసుకుని వెడుతున్న రెండువిమానాలు నేడిక్కడికి వచ్చినవి. ఈ ప్రభుత్వసభ్యుల రాకను పట్టి కొమింటాంగ్ ప్రభుత్వం తమవాలుగో రాజధానిని కొద్ది రోజులకన్నా గ్రికాపాడలేదని భయపడుతున్నట్లు ఇక్కడ అర్థంచెప్పబడుతున్నది.

మిగిలిన కొమింటాంగ్ ఉద్యోగులు జెక్వాన్ రాష్ట్రానికి పడమరగా ఉన్న సికాంగ్ రాష్ట్రానికి వెళ్ళారని ఈ వేళ వచ్చిన ప్రభుత్వసభ్యులు వెల్లడించారు. ప్రస్తుతరాజధాని చెంగ్టూకు 95 మైళ్ళలో ఉన్న నైకియాంగ్ మీద కమ్యూనిస్టుసేనలు దాడిచేస్తున్నవి.

క్వాంగ్సీ రాష్ట్రంలో కొమింటాంగ్ సేనాని పాయ్‌చంగ్షికి కేంద్రమైన నానింగ్‌కు 30 మైళ్ళ దూరంలో కమ్యూనిస్టు సేనలు ఉన్నవనీ, రాష్ట్రప్రభుత్వాన్ని హైనాన్ ద్వీపానికి చేరవేయటానికి విమానాలు సిద్ధంగా ఉన్నవనీ అక్కడినుంచి వచ్చిన ప్రయాణీకులు తెలియజేశారు.

### కొమింటాంగ్ సైన్యాల తగ్గింపు

ఫార్మోసానుండి కొమింటాంగ్ వర్గాలద్వారా తెలుస్తున్న దానిని బట్టి, ఫార్మోసా గవర్నర్ చెన్‌చెన్ ఖర్చు తగ్గించటంకోసం, ద్వీపంలో ఉన్న సైన్యాల్లో మూడింట రెండు వంతులను రద్దుచేస్తున్నాడట! ద్వీపంలో లక్ష సైన్యం ఉన్నదని ఇటీవల అనధికార రీత్యా తెలిసింది.

శుక్రవారం నాడు తమ విమానాలు చుంకింగ్ మీద బాంబులు వేసినవని కొమింటాంగ్ అధికారులు ప్రకటించారు.

### అమెరికాకు లీసంగ్ అభ్యర్థన?

కొమింటాంగ్ ప్రభుత్వతాత్కాలిక అధ్యక్షుడు లీసంగ్ జెన్ రేపు అమెరికాకు బయలుదేరబోతున్నాడు. చికిత్స కోసం వెడుతున్నానని ఈయన చెప్పినప్పటికీ, నిజానికి వెడుతున్నది అమెరికా సహాయాన్ని అర్థించటానికేనని తెలుస్తున్నది.

కొమింటాంగ్ పరిస్థితి ప్రమాదకరంగనే ఉన్నప్పటికీ కమ్యూనిస్టు ఆక్రమిత ప్రాంతాల్లో కమ్యూనిస్టు విరుద్ధభావాలు నానాటికీ ఎక్కువవుతున్నవని తనకు నమ్మకం కలిగిందని లీసంగ్ అన్నాడు.

"కమ్యూనిస్టు విజయాలు తూర్పు ఆసియాకు చాలా ప్రమాదకర పరిస్థితులు తెచ్చిపెట్టినవి. వియట్నాం నాయకుడు హోచిమిన్ చైనా కమ్యూనిస్టులతో చేదోడు వాదోడుగా వ్యవహరిస్తున్నాడు. ఇండోచైనాను ఆక్రమించటం మినహా వాళ్లు హోచిమిన్‌కు సర్వసహాయాలూ చేస్తారు" అని అతడు అన్నాడు.

### ఫార్మోసా ఆక్రమిస్తామని కమ్యూనిస్టుల సూచన

కమ్యూనిస్టుచైనా వార్తాసంస్థ 'న్యూచైనా' నేడిట్లు వెల్లడించింది: "కమ్యూనిస్టు ప్రజాసైన్యంలో వచ్చే సం॥నికి 50 లక్షలమంది సైనికులుంటారు. ప్రభుత్వోద్యోగులు, విద్యాప్రచారకులు కలిపి 30 లక్షలుంటారు. ఇంతేకాక నైఋతిచైనా (టిబెట్‌తో సహా), ఫార్మోసా, హైనాన్ ద్వీపాలకుకూడా విమోచన కలిగించినప్పుడు ఎంతోమంది కొమింటాంగ్ ఉద్యోగులనుకూడా ప్రభుత్వము పోషించవలసి ఉంటుంది. దాని వల్ల వచ్చే సం॥ బడ్జెట్ ఇంకా పెరుగుతుంది."

# పరిష్యన్ యాత్రికుల పట్ల ఇరాక్ అమర్యాద వర్తన

## పరిష్యా ప్రతీకారం

టెహరాన్, డిసెంబరు 4: ఇరాక్‌లో పుణ్యక్షేత్రాలను సందర్శించడానికి వెళ్లిన 20 వేలమంది పరిష్యన్లు ఇరాక్ సరిహద్దుకుయిరువైపులా ఆటకాయింపబడినారు. 50 వేలమంది పరిష్యన్లు యీ పుణ్యక్షేత్రాలను దర్శిస్తున్నారని, వీరికి త్రాగుటకు నీరుగాని ఆహార సౌకర్యాలుగాని లేనందువల్ల మార్గమధ్యంలో మరణించారని నమ్మకమైన వార్తల ద్వారా తెలుస్తున్నది.

ఇరాక్ ప్రభుత్వం తన పౌరులయెడ అమర్యాదకరంగా ప్రవర్తించినందుకు ప్రతీకారంగా, పరిష్యాలోని, ఇరాక్ ప్రజలు 14 రోజులలోగా దేశంవిడిచి వెళ్ళాలని తాము ఆదేశించినట్లు పరిష్యాప్రభుత్వం శనివారం రాత్రి ప్రకటించింది. కాని తర్వాత యీ గడువు కొన్ని నెలలవరకూ పెంచింది.

# ప్రపంచాహార వ్యవసాయక సంస్థ

## సభ్యత్వం బుసుము హెచ్చింది

వాషింగ్టన్, డిశంబరు 4: డాలర్ ప్రాంతానికి చెందని ఇండియా మొదలైన దేశాలు సమితి తాలూకు ఆహార వ్యవసాయక సంఘం సభ్యత్వం కోసం కట్టవలసిన మొత్తం బాగా పెరుగుతుంది.

అందువల్ల ఈ దేశాలన్నింటికి కొత్త స్కేలు ఏర్పాటుచేసే విషయమై నిన్న రాత్రి సంఘం ఒక ఒప్పందానికివచ్చింది.

పూర్వం ఇండియా 3.79% కట్టుతూ వుండేది. ఇప్పుడు దాన్ని 4.42% మార్చారు. పాకిస్తాన్ .82% కట్టేది ఇప్పుడు అది .95% దాకా పెంచారు.

ఈ కొత్త స్కేళ్ళను సమితి సర్వసభ్యసమావేశం అంగీకరించవలసివుంది. ఈ సంఘంలో వీటికి అనుకూలంగా 28 ఓట్లన్నూ వ్యతిరేకంగా 5 ఓట్లున్నూ వచ్చాయి.

ఈ సమావేశంలో ఇండియా, ఆస్ట్రేలియా, కెనడాలు మరికొన్ని దేశాలను కలుపుకొని ఏదేశం శక్తిని పట్టి ఆదేశం ఇస్తుంది. అన్న తీర్మానాన్ని ఒకదాన్ని తెచ్చారు. గాని, ఓటుకుపెట్టగా అది వీగిపోయింది.

ఆ మీదట ఆస్ట్రేలియా, ఫ్రాన్సు, కెనడాలు, ఈ కొత్తస్కేళ్ళ విషయంలో అంతిమనిర్ణయం తమ ప్రభుత్వాలచేతుల్లో వున్నదని స్పష్టంగా ప్రకటించారు.

### స్టెర్లింగ్-డాలరు మార్పు

వాషింగ్టన్, డిశంబరు 4: స్టెర్లింగు, డాలర్ మార్పుదలను సుకరం చేయాలంటూ ఐర్లెండు తెచ్చిన తీర్మానాన్ని సమితి తాలూకు ఆహార వ్యవసాయక సంఘం త్రోసిపార వేసింది.

# "లిబియా స్వాతంత్ర్య సమరం యింకా సమాప్తం కాలేదు"

## లిబియన్ ప్రజకు అరబ్‌లీగ్ కార్యదర్శి సందేశం

కైరో, డిసెంబరు 3: అరబ్‌లీగ్ కార్యదర్శి అజ్జంపాషా, లిబియా ప్రజలకు లిఖిత పూర్వక సందేశాన్ని పంపుతూ, "లిబియా స్వాతంత్ర్య పోరాటం" యింకా సమాప్తం కాలేదని హెచ్చరించారు. "ప్రజ సుఖ సౌభాగ్యాలకోసం కృషిచేసే జాతీయ ప్రభుత్వాన్నేర్పాటు చేసి,లిబియారాజ్యాన్ని ఘట్టి పునాదులపై నిర్మించడానికి, మీరిప్పుడొక కొత్త సమరాన్ని ప్రారంభించారు. ఈ కొత్త లిబియన్ రాజ్యము, ప్రపంచ ప్రజలమన్ననలను బడయవలెను."

రమారమి 30 యేండ్ల క్రితం అజ్జంపాషా టర్కీలలో సెనూసీస్‌తోనూ కలసి, లిబియాలో ఇటాలియన్ పై పోరాటం సాగించాడు. లిబియా స్వాతంత్ర్యం కొరకు పోరాడిన వృద్ధులలో వీరులలో యీయన ఒకడు.

# ఇజ్రేల్ పట్ల జెరూసలేం యూదుల విశ్వాస ప్రకటన

జెరూసలేం, డిసెంబర్ 4: జెరూసలేంలోని పేలకొద్దీ యూదులు ఈ వేళ ప్రత్యేక యూదు రాజ్యస్థాపనోద్యమ ప్రముఖుడైన డా॥ థియడోర్ హెర్జ్ల్ సమాధి దగ్గర సమావేశమై ఇజ్రేల్ పట్ల విశ్వాసం కలిగి ఉంటామనీ, జెరూసలేంను ఎన్నటికి విడవబోమనీ శపథం చేశారు. ప్రధాన రబ్బీ ముందు చెప్పుతుండగా 'జెరూసలేం' నిన్ను మేము మరిచిపోతే మాహస్తాలశక్తి లేకుండా పోవాలి గాక! అని శపథాన్ని పునశ్చరణ చేశారు.

జెరూసలేం మీద అంతర్జాతీయ పాలన నెలకొనటాన్ని తాము సహించమని వారు ప్రతిజ్ఞ చేశారు.

ఇజ్రేల్ రాజధానీ టెల్ఎవీవ్ పురపాలక సంఘం నేటి సాయంత్రం సమావేశమై జెరూసలేం మీద అంతర్జాతీయ పరిపాలన నెలకొల్పే ప్రతిపాదనను వదులుకోమని సమితిని కోరటానికి నిశ్చయించింది.

జెరూసలేం మీద అంతర్జాతీయపాలనను నెలకొల్పాలని ప్రత్యేక ఉపసంఘం చేసిన సూచన మీద అదనపు రాజకీయసంఘం ఈ వేళ చర్చిస్తుంది.

### ఢిల్లీకి రాజాజీ రాక

న్యూఢిల్లీ, డిసెంబరు 4: గవర్నరు జనరల్ రాజగోపాలాచారిగారు తమ అస్సాం ఒరిస్సా పర్యటన ముగించుకుని ఈ వేళ సాయంకాలానికి న్యూఢిల్లీ చేరుకున్నారు. వారితో సైనిక కార్యదర్శి కూడా ఉన్నారు.

# కాంగ్రెస్ ప్రభుత్వము సాధించిన మహత్కార్యములు

## విమర్శకులకు రాష్ట్రపతి జైన సమాధానము

పాట్నా, డిశంబరు 4: "మనకు స్వాతంత్ర్యము చేకూరిన తరువాత కాంగ్రెస్ ప్రభుత్వము యెట్టి కష్టముల నెదుర్కొనెనో, ఈ మహాకష్టముల నెదుర్కొని కాంగ్రెస్ ప్రభుత్వము యెట్టి మహత్కార్యములను సాధించగలిగెనో విచారింపుడు" అని కాంగ్రెస్ మహాసభా అధ్యక్షులగు డా॥ పట్టాభి సీతారామయ్యగారు నేటి సాయంకాలము యిచ్చట మహాసభలో నుపన్యసించుచు కాంగ్రెస్ విమర్శకులను కోరిరి.

మొదట హిందూస్థానిలోను తరువాత ఆంగ్లభాషలోను అనర్గళముగా ఉపన్యసించుచు రాష్ట్రపతి యిట్లు ప్రకటించెను: "కాంగ్రెస్ ప్రభుత్వమువారు దేశమును ఏకము గావించిరి. అసంఖ్యాకములుగా నున్న సంస్థానములను భారత దేశములో కలిపి వేసిరి. ప్రజలలో వివిధ వర్గములవారి మధ్య కల్పింపబడిన కృత్రిమ భేదములను, మతముపైనను భాషపైనను ఆధారపడిన వానిని వారు తొలగించి వేసిరి. గాంధీ మహాత్ముని వాంఛలు సఫలమైనవి. శాసనంద్వారా వారు అస్పృశ్యతను నిర్మూలించిరి. వివిధ మతములవారి మధ్య సఖ్యతకుదిర్చిరి. హిందూధర్మశాస్త్ర క్రోడీకరణ చట్టముద్వారా స్త్రీలకు విముక్తి కలిగించ దలచుచున్నారు. ప్రజారాజ్యములలో అన్ని హక్కులకంటె గొప్పది వోటింగు హక్కు. ఇట్టి హక్కు భారత రాజ్యాంగ విధానంద్వారా వయోజనులందరికిని ఒసంగబడుచున్నది. 30 కోట్ల జనాభాలో 8½ కోట్ల పురుషులకు, 8½ కోట స్త్రీలకు వోటుచేయు హక్కు వుండును."

# డిసెంబరు 7 'పతాకదినం'

న్యూఢిల్లీ, డిసెంబరు 4: డిశంబరు 7 వ తేదీని పతాక దినంగా ప్రభుత్వం నిశ్చయించినట్లు నేడు భారతరక్షణశాఖా మంత్రి సర్దార్ బలదేవసింగ్ ఒక ప్రకటన చేశారు.

యుద్ధంలో పనిచేసి ఇప్పుడు పూరికే వుంటున్న సైనికుల సహాయార్థం ఈరోజున నిధివసూలుచేస్తారు.

ఈ సంవత్సరంలాగే ఈ డిశంబరు 7 ఇకముందుకూడా పతాకదినంగా ప్రవర్తిల్లుతుంది.

ఈ సందర్భంలో ప్రజలకు ఒక విజ్ఞప్తిచేస్తూ, మనసైనికుల క్రమశిక్షణను, శక్తిసామర్థ్యాల నుగ్గడించి, వారిపట్ల భారతజాతి తమకు గల గౌరవాన్ని ప్రదర్శించగలదినం డిశంబరు 7 తేదీగా పేర్కొన్నారు.

ఈ రోజున వసూలుచేసే నిధిని ఒక్క మాజీసైనికుల సహాయార్థమే గాక, ప్రస్తుతం సైన్యంలో పని స్తున్నవారికి మంచి సౌకర్యాలు కల్పించేందుకుకూడా ఖర్చు పెడతారు.

# గవర్నరు జనరలు సంతకం విలువ 5 రూపాయలు

కటకం, డిసెంబరు 4: గవర్నరు జనరలు ఆటోగ్రాఫ్ (సంతకం) కావలసిన వారు తమ ఆటోగ్రాఫు పుస్తకాలతో బాటు 5 రూపాయలు గవర్నరు జనరలు అంగరక్షకునికి అందిస్తే కొద్ది సేపటిలో పుస్తకం సంతకంతో సహా తిరిగివస్తుంది.

ఈ సొమ్ము హరిజన నిధికి ఇవ్వబడుతుందట.

# ఇండియా పాకిస్తాను సరిహద్దు తగాయిదా తీర్మాన సంఘం

కలకత్తా, డిసెంబరు 4: ఇండియా పాకిస్తాను సరిహద్దు తగాయిదా తీర్మాన సంఘంవారు రేపటినుంచి తమసమావేశాలు ఆరంభమవుతవనీ, పశ్చిమబెంగాలు శాసన సభలో సమావేశమవుతామనీ ప్రకటించారు.

ఈ సంఘానికి అధ్యక్షుడు లార్డు జస్టిస్ బాగ్, ఇండియా ప్రతినిధి జస్టిసు చంద్రశేఖరఅయ్యరు, పాకిస్తాను ప్రతినిధి జస్టిసు షాబుద్దీను.

# సమితిలో కొమింగ్‌టాంగ్ వాదం

లేక్‌సక్సెస్, డిసెంబరు 5:— ఐక్యరాజ్య సమితి సభ్యులు కమ్యూనిస్టు చైనాను గుర్తించరాదని తాను మొదట చేసిన ప్రతిపాదనను కొమింటాంగ్ ప్రతినిధి డా॥ సియాంగ్ ఉపసంహరించుకుంటున్నట్లు ప్రకటిస్తారని భావించబడుతున్నది. ప్రతిపాదన వోటింగులో వీగిపోక తప్పనట్లు కనిపిస్తున్నది. కనుక వోడిపోవటంకన్నా ఉపసంహరించుకొనటమే మేలని కొమింగ్‌టాంగ్ ప్రతినిధి వర్గం భావిస్తున్నట్లు పరిశీలకులు చెబుతున్నారు.

# ప్రపంచ సౌమనస్య సంఘ సమావేశం

## సేవాగ్రాం సభకు రమ్మని పండిత నెహ్రూకు ఆహ్వానం

శాంతినికేతన్, డిసెంబరు 4: ఇక్కడ ప్రస్తుతం సమావేశమవుతున్న ప్రపంచ సౌమనస్య సంఘం, తాను సేవాగ్రాంలో జరిపే సమావేశానికి ప్రధాని పండిత నెహ్రూనుకూడ ఆహ్వానించటానికి నిశ్చయించింది. సాయుధరక్షణ విషయంలో సౌమనస్యవాదులకూ, మిగిలినవారికీ పెద్ద విభేదమున్నదనీ, అందువల్ల ప్రధాని రక్షణ బాధ్యతను రాష్ట్రప్రభుత్వానికి వదులుతున్నామనీ సమావేశం తీర్మానించింది.

సైనికసేవ తన హృదయానికి నచ్చనందున సైన్యంలో చేరటానికి నిరాకరించి డిసెంబర్ 6 వ తేదీన పారిస్‌లో సైనిక న్యాయస్థానంచే విచారించబడనున్న జె. బి. మొరోపట్ల సానుభూతిని చూపుతూ సమావేశం మరొక తీర్మానం చేసింది.

సేవాగ్రాం సమావేశంలో ప్రతినిధులంతా 7 రోజులు ఉపవాసాలు, ప్రార్థనలు జరపాలని మణిలాల్ గాంధీ సూచించాడు.

జపాన్ ప్రతినిధి డా॥ టోయికోవాడా కోరా మాట్లాడుతూ యుద్ధకాలంలో తమ దేశంలో 130 మంది మత విషయిక సౌమనస్యవాదులు శిక్షించబడ్డారని వెల్లడించాడు. జపాన్ నిరాయుధ దేశంగా వుండాలని జపాన్ రాజ్యాంగపరిషత్తు ఏకగ్రీవంగా నిర్ణయించిందని ఆయన వెల్లడించాడు.

అమెరికన్ ప్రతినిధి సేర్ జపానులో కలిగిన పరివర్తనను ధృవపరిచాడు. దీని విషయమై భారతప్రతినిధి డా॥ అమియ చక్రవర్తి సందేహం వెల్లడిస్తూ జపాన్ పరిస్థితులు స్తంభించి చైతన్యం లేకుండా పోయినదని అన్నాడు.

# ఇండియాలో అమెరికను చిత్రం షూటింగు

లక్నో, డిసెంబరు 3: రుడ్యార్డ్ కిప్లింగు రచించిన "కిమ్" అనే నవల తాలూకు కొన్ని దృశ్యాల షూటింగు నేడిక్కడి లామార్టినియే కాలేజి ఆవరణలో ఆరంభమయింది. ఈ చిత్రాన్ని డైరెక్టు చేస్తున్నది "గ్రీన్ డాల్ఫిన్ స్ట్రీట్" అనే ప్రసిద్ధ చిత్రం నిర్మించిన విక్టర్ సావిల్. రెండు రోజులక్రితం ప్రత్యేక విమానంలో 22 మంది టెక్నీషియనులూ, కామెరామెన్, కామెరాలతోనూ, ఇతర పరికరాలతోనూ దిగారు. 19 వ శతాబ్దంనాటి మీటరుగేజి ఇంజనూ, పెట్టెలూ గోరఖ్పూరునుంచి తెప్పించ బడినవి. సోమవారంనాడు జరిగే షూటింగుకు వీటిని ఉపయోగిస్తారు. ఈ చిత్రానికి కావలసిన ఇతర దృశ్యాలు బూందీ, జయపూరు నగరులలో "షాట్" చేయబడతవి.



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press. No. 7, Thambu Chetty Street, G. T. Madras.